# ధాతృప్రశ్నః

అథవా

# వేదాన్తమణ్డనమ్

మూలం

డా. సూరం శ్రీనివాసులు

తాత్పర్యం

సూరం చంద్రశేఖరం

అచ్చతెనుఁగు

డా. పాలపర్తి శ్యామలానందప్రసాద్

ప్రకాశకులు

రావి మోహనరావు M.Sc., MA (Sanskrit)

510, ఫ్రైడ్ బ్లాక్, ప్లాటినమ్ కౌంటీ

గోరంట్ల, గుంటూరు – 522 034

# ధాతృప్రశ్నః అథవా వేదాన్తమణ్డనమ్

**మూలకర్తా:** డా॥ సూరం శ్రీనివాసులు
**ఆంధ్రతాత్పర్యకర్తా:** సూరం చంద్రశేఖరం
**పద్యానువాదకర్తా:** డా॥ పాలపర్తి శ్యామలానందప్రసాద్

**ప్రథమముద్రణ:** అక్టోబర్ 2021

**ప్రతులు:** 200

**పుటలు:** 116

వెల: **₹ 99/-**

**ప్రకాశకులు:** రావి మోహనరావు

**ప్రతులకు:**

| | | |
|---|---|---|
| రావి మోహనరావు | 9440115411 |
| డా॥ సూరం శ్రీనివాసులు | 9440242348 |
| సూరం చంద్రశేఖరం | 9492678391 |
| డా॥ పాలపర్తి శ్యామలానందప్రసాద్ | 9440346287 |
| విట్టుబాబు | 8555082034 |

**డిటిపి**
విట్టుబాబు
హైదరాబాద్

**ముద్రణ**
కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
హైదరాబాద్

# धातृप्रश्नः

अथवा

# वेदान्तमण्डनम्

मूलम्

डा. सूरम् श्रीनिवासुलु

तात्पर्यम्

सूरम् चन्द्रशेखरम्

अच्छान्ध्रीकरणम्

डा. पालपर्ति श्यामलानन्दप्रसाद्

प्रकाशकः

रावि मोहनराव्

M.Sc., MA (Sanskrit)

510, PRIDE BLOCK, PLATINUM COWNTY,

GORANTLA, GUNTUR ' 522 034

**DHATṚ PRAŚNAḤ**

ATHAVA

**VĒDĀNTAMAṆḌANAM**

**Author:** Dr. Suram Srinivasulu

**Translator - Telugu Prose:** Suram Chandrasekharam

**Translator - Telugu Poetry:** Dr. Palaparti Syamalananda Prasad

First Edition: October 2021

Copies: 200

Pages: 116

Price: Rs.99/-

**Publisher:** Ravi Mohana Rao

| | | |
|---|---|---|
| **For Copies** | Ravi Mohana Rao | 9440115411 |
| | Dr. Suram Srinivasulu | 9440242348 |
| | Suram Chandrasekharam | 9492678391 |
| | Dr. Palaparti Syamalananda Prasad | 9440346287 |
| | P. Vittu Babu | 8555082034 |

**DTP**

P. Vittu Babu

Hyderabad

**Printed at**

Karshak Art Printers

Hyderabad

# నా మాట

"నైషా తర్కేణ మతిరాపనేయా" అన్న ఉపనిషద్వచనాన్ని అందరం అంగీకరించాం. "యతో వాచో నివర్తన్తేఽప్రాప్య మనసా సహ" అన్న మాటనూ శిరసావహించాం. ఆ అభిప్రాయాలన్నీ మహర్షుల నిరంతరాలోచనల ఫలితాలు. వారిమీద నున్న అపారభక్తితో వాటిని ఔదలదాల్చాం. ఆ విధంగా ఋషిఋణం తీర్చుకుంటున్నామని గర్వపడుతూ జీవిస్తున్నాం.

ప్రధానోపనిషత్తులుగా పరిగణింపబడుతున్న వన్నీ శంకర భగవత్పాదుల కాలానికన్నా ముందువే. అందుకే వారు ఆ పదింటికీ వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు అద్వైతమతాన్ని వాటిలో ప్రతిక్షేపిస్తూ. ఆ తర్వాత కొన్ని శతాబ్దాలకు రామానుజులు, మధ్వాచార్యులు విశిష్టాద్వైత, ద్వైతమతాలను ప్రతిపాదించారు. అది జరిగీ చాలా శతాబ్దాలు గడచి పోయాయి. ఆధునిక పండితులు వాటిని యథాతథంగా అనుసరించటమే తప్ప ఆలోచించటం కూడా దోషమే అన్న భావాలకు ప్రాణం పోశారు.

ఆలోచనలను ఆపటమంటే జ్ఞానప్రసారాన్ని ఆపివేయటమే అని కూడా అనిపించటం లేదు వీరికి. జ్ఞానపరిధి విస్తరించటమే మానవజాతి పురోగతి. దానికి మూలం ఆలోచన.

ఆ కోణంలో కొన్ని స్వతంత్రాలోచనలతో, కొన్ని నూతన సమన్వయాలతో, కొన్ని యథాతథ స్పష్టతలతో సాగిన ఈ వేదాన్తమణ్థనం క్రొత్తగా ఆలోచించటంలో ఏ మాత్రమైనా సఫలమై, ఒకరిద్దరినన్నా ప్రభావితం చెయగలిగతే మా ప్రయత్నం ఫలించినట్టే.

శ్లోకాలకు సరళంగా తాత్పర్యం వ్రాసి అందించిన సూరం చంద్రశేఖరం గారికీ, అచ్చతెనుగులోనికి అనువదించిన అంతేవాసి పాలపర్తి శ్యామలానందప్రసాద్‌కు అభినందనాశీస్సులు. గ్రంథాన్ని ఆద్యంతం పరిశీలించి *'ప్రశ్నోపనిషద్'* పేర ముందుమాటను అందించిన అంతేవాసి చిరంజీవి Ch.P. సత్యనారాయణకు ఆశీరభినందనలు. పెద్దరికంతో 'శుభాశంసనవచనాలు' పలికిన డా॥ రాణి సదాశివమూర్తికి కృతజ్ఞతలు. ప్రచురిస్తున్న ఉద్యమశీలి రావి మోహన్ రావు గారికి కృతజ్ఞతలు.

**Prof.Ch.P.Satyanarayana(Rtd)**
Director (Directorate of Distance Education)
Dean (Sahitya & Samskriti)
Registrar (i/c)
National Sanskrit university, Tirupati

# ప్రశ్నోపనిషద్

మానవుని అభ్యుదయానికి నిశ్రేయసానికి ఉపనిషదాది వాఙ్మయం, వివిధ శాస్త్రవాఙ్మయం ఉద్దిష్టమైనది. ఈ వాఙ్మయాన్ని దుఃఖత్రయ నిర్మూలన ద్వారా మానవుడు తన అభివృద్ధిని నిశ్రేయస్సుగా చెప్పబడుతున్న పరమానందాన్ని పొందేందుకు వినియోగిస్తాడు. అటువంటి వాఙ్మయం చేస్తున్న ఉపదేశపు అవగాహనలో, ఆచరణలో - తొందరపాటుతో, తొట్రుపాటుతో విషయవైపరీత్యం కూడా కనిపిస్తోంది. కొన్నిచోట్ల విషయ అస్పష్టత, బోధనకు ఎన్నుకున్న మాధ్యమాలలో తొందరపాటు ఈ సందేహాలకు మరింత దోహదం అవుతుంది.

మహాజనులు నడిచిన దారిలోనే నడవాలని ఉపదేశింపబడ్డ సామాన్యజీవుడు మిథ్యావాద విశారదులను తథ్యాచార పరాయణులుగా భావించి ప్రేయోమార్గాన్నే ఎంచుకునే ప్రమాదంలోకి నెట్టబడుతున్నాడు. ఆనందమయ జీవనానికి ఉన్న ఆవరణలు తొలగించి, సత్క్రియా పరత్వాన్ని తొడిగి వాస్తవం మీదనే జీవించే హక్కును ప్రతి జీవికి అందించుదామనే లక్ష్యంతోనే వాఙ్మయం రూపు దిద్దుకోవాలి, వివరించబడాలి. తదనుగుణ కార్యాచరణకు పూనుకున్న విజ్ఞులకు అవరోధాలు కలుగకూడదు.

ప్రాణికోటి ఉనికికి, ఉన్నతికి ఈ జగత్తే దోహదం చేస్తుంది. అటువంటి ఈ జగత్తు నిస్సారంగా, మిథ్యగా చిత్రించడం ద్వారా కూడా చేతనాపూర్ణమైన మేథ కలవరపాటుకు గురవుతుంది. మిథ్యగా ముద్రవేయబడిందీ బ్రహ్మమే. అదే సత్యంగా నిలిచి ఉంటుంది. ఆ మిథ్యయే జగత్తుకు అధిష్టానమై నిలిచింది. ప్రమాణమాధ్యమంగానే గోచరిస్తూ, ప్రమేయంగా సాక్షాత్కారానికి అందకుండా వున్నదాన్ని సత్యమని విధించడం వలన అయోమయం ఏర్పడింది. బాహ్యప్రపంచం స్థూలం. దీని స్వరూపస్వభావాల అవగాహనతో

సూక్ష్మమైన, అదృశ్యమైన తాత్విక ప్రణాళికను ఎరుకలోకి తెచ్చుకోవాలి. అనుభవాల, ఆలోచనల సామంజస్య పరిశీలనే జీవనసౌందర్యం. స్థావరజంగమాత్మక ప్రపంచపు వివర్తాలను ఆర్ద్రతతో ఆస్వాదిస్తుంటే జీవనం. ఆ వివర్తాల స్వరూపస్వభావాలను అంతఃకరణంలో అనుశీలనం చేస్తూ లయాన్ని గుర్తిస్తే రసానందం.

అంతఃకరణాన్ని నిర్మలంగా చేసి ఈ అక్షరాలను పరిశీలించుదాం.

**బుభుక్షాముక్తీచ్ఛే ధృతిశమదమా నైవ పరమాః**
**స్వయం యాన్త్యేవాన్యే ప్రకటితభవా బాన్ధవజనాః।**
**రసీభూతం చేతోఽ నుభవతి పరం జ్ఞాతవిషయం**
**కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥** (శ్లో 7)

ధ్రువం, అధ్రువం రెండూ పరబ్రహ్మసృష్టిలో రెండు పార్శ్వాలు. వీటిలో ఏ ఒక్కదానికో పరిమితమవడం వలన అనేక సంశయాలు ఉత్పన్నమవుతున్నాయి. ధ్రువంగా ఉండి అధృవాన్ని పరికించేటపుడు జీవుడు ద్రష్ట. అధ్రువం మీద సంచరిస్తూనే ధ్రువాన్ని నిలకడగా ఉంచితే అదే జీవుడు ధ్యాత. ద్రష్టృ ధ్యాతల సమానస్థితి సామాధికం. ఇంతకు ముందు చెప్పినట్లు అందుబాట్లోవున్న మాధ్యమాల ఎన్నికలో తొట్రుపాటో, వాస్తవిక అవగాహన నిర్ధారణలో దొర్లే తొందరపాటో గానీ ప్రతిజీవి చైతన్యం సంశయానికి గురవుతోంది. శ్రీరామచరితలో ఆంజనేయుని ఉదంతం భూమికి మేరువులాంటిది కదా. శ్రీరామ అవతారానికి ముందు తర్వాత ఆయన వ్యాప్తి నిస్సందేహంగా నిరూపితం. తొలిచూపులోనే శ్రీరాముని చేత భాషణచాతుర్యం వలన జ్ఞానిగా కీర్తింపబడినవాడు హనుమ. శ్రీరాముడు తన హృదయంలోనే వున్నాడని ముత్యాలహారంలోని ఒక్కొక్క ముత్యాన్ని కొరికి విసిరేస్తూ నిరూపించాడు. సర్వత్రా వ్యాపించి వున్న పరమాత్మ ముత్యాలలో ఎందుకు లేడనే ప్రశ్న వ్యాకులతను కలిగిస్తుంది. మరి అది ప్రశ్నే.

**రామ ఏవ పరంబ్రహ్మ రామ ఏవ పరం తపః**
**రామ ఏవ పరం తత్త్వం శ్రీరామో బ్రహ్మకారకమ్** ( శ్రీ.రా.ఉ 16)

దీన్ని శిథిలం చేయడానికి, తొలగించడానికి, గమ్యం చేరుకోవడానికి ఓ ఉపనిషత్ కావాలి. ఈ గ్రంథమే ఆ ఉపనిషత్తు.

పరమభాగవతోత్తముడు ప్రహ్లాదుడు ఎందెందు వెతికినా అందెందే కలడటంటూ ఈ విషయాన్ని విశదీకరించడంలో సఫలమయ్యాడు కదా.

**యదా హి భగవాన్ ఏవ వస్తుతో సదసత్ చ యత్**
**సత్యేనానేన నస్సర్వే యాంతు నాశముపద్రవాః** (భాగ.6.8.31)

బహుకాలాభ్యాసం వల్ల ఏర్పడ్డ మోహంవల్ల, వాసనలవల్ల, సుఖం కలిగినచోట రాగం, దుఃఖం కలిగినచోట ద్వేషమూ, విరక్తీ నైసర్గికమే. అది అభ్యుదయానికి, నిశ్రేయసానికి అవరోధమైనపుడు దానిని విశదీకరించే క్రమంలో మూలచ్ఛేదమొకటే సుగమంగా గోచరించకూడదు. ఒకసారి వాసనలవల్ల దొర్లే పొరపాట్లు నిలపగలిగితే నిలకడగా పరిశీలిస్తే ఈ ఉపద్రవాలు ఉండవని వ్యాసమహర్షి ఉపదేశం. ఇహమూ పరబ్రహ్మసృష్టే. అసలు పరబ్రహ్మమే. ఈ సత్యం సంశయదూరమైతే ఇహమూ పరమే. ఇక తారతమ్యాలెందుకు! క్షీర-నీర వివేచన నైపుణ్యం సామర్థ్యం కలిగిన హంస క్షీరగ్రాహిగా ఉండడం నీరానికి వైయర్థ్యం నిరూపించడానికి కాదు. సాపేక్షంగా హంసకు అవసరం, అనవసర మనేవే ప్రాతిపదికాలు. సార్థకత-నిరర్థకతలు సాందర్భికాలే కానీ శాశ్వతాలు కావు. *'దప్పి గొన్నట్టివారి కా దప్పిదీర సలిలపూరంబు హితవో యాజ్యంబు హితవో'* అని ఆ సందర్భంలో నీటి విలువ ఆజ్యానికి లేదని తేల్చి దేవతల మన్ననలు పొందిన దమయంతి ఎన్నో సందేహాలను శిథిలం చేసి, తొలగించి, గమ్యాన్ని సూచిస్తోంది కదా!

వివిధ గుణసమ్మేళనల అల్లిక అయిన ఈ సర్జనక్రియ ఏ ప్రణాళికను సూత్రీకరణను పాటిస్తూ విధి నిర్మిస్తున్నాడన్నది మన ఆలోచనకు ఊహలకు అందని విషయమే. ఇది అవగతం కాని దశలో పరిమితుల్లో ఉపక్రమిస్తున్న మన మేధకు అందిన ప్రమాణాలతో విషయనిర్ధారణ చేసి జగత్తుని నిస్సారంగా చూడటం, మన సుఖదుఃఖాలతో బేరీజు వేయటం యథార్థావగాహనల అభిగమననానికి దారితీయదు. రంగస్థలంలో పాత్రోచితంగా వ్యవహరిస్తున్నామన్న భావనతో విధి సూత్రీకరణను, ప్రణాళికను గణించక శంతనుడు గంగను కోల్పోయినట్టు జీవనసౌందర్యానికి జీవుడు దూరమవుతున్నాడు.

ముక్తి విచారణాధీనంగా వున్నట్టుంది. అందువల్ల ముక్తి దేనినుండి అనే ప్రశ్న వస్తోంది. జగత్తు బ్రహ్మసృష్టే, బ్రహ్మమే అయినపుడు దానినుండి

ముక్తికోరడం సబబు కాదేమో అనే వివేచన చేయవలసి వస్తోంది. జగత్తంతా పరిణామాత్మకమే అయినపుడు రూపాంతరంతోనో, నామాంతరంతోనో సంచరిస్తున్నపుడు పూర్వరూపం, నామం కనిపించకపోవడం మోక్షంగా భావించడం వల్ల మరణం తర్వాతనే మోక్షం అనే భావన కలిగేట్టు చేయడం ఆలోచించే ప్రాణులను యథార్థానికి దూరంగా ఉంచడమే.

మరణం ధ్రువం అన్నది సాక్షాత్కృతం. పునర్జననం ధ్రువం అన్నది సాక్షాత్కృతి దూరం అయినా అదీ ధ్రువమే అన్నది ఇతర ప్రమాణాలగమ్యం. ఇలా జనన - మరణాలు ధ్రువం అన్నపుడు జన్మరాహిత్యం దుర్నిరూప్యం. అందువల్ల మరణరాహిత్యమే మోక్షమని చేసే బోధనలన్నీ మోక్షం దేనినుంచో తెలియని స్థితిలో నిలుపుతాయి. దీనిని నిలువరించాల్సిందే కదా.

అనుభవానికి దూరమైన ఉపదేశాలు నిరాదరణకు గురవుతున్నాయి. ప్రత్యక్షంగా అనుభవరూపంలో సత్యంగా భాసిస్తున్న జగత్తుని మిథ్యగా ముద్రించి, కేవలం ఊహామాత్రంగా అనుభవానికి రాని ప్రమాణాలతో నిరూపితమయ్యే బ్రహ్మమును సత్యంగా బలపరుస్తున్న శాస్త్రసంపద, వైయక్తిక పరిమితుల్లో పెద్దల ప్రబోధాలు జీవుల సాక్షాత్కారానికి దూరంగా వున్నాయి. ఒక్కడే బహుగా వుండడం బ్రహ్మ సంకల్పమే అయినపుడు బహుత్ర కనిపిస్తున్న బ్రహ్మ వివర్తాలను బ్రహ్మగా గుర్తింపజేయడమే విజ్ఞుల కర్తవ్యం కదా. అదే ఈ గ్రంథలక్ష్యం.

పరబ్రహ్మసృష్టిలో తత్తత్సమయానుగుణంగా సమస్తమూ ప్రాధాన్యాన్ని సంతరించుకునే ఉంటాయి. అటువంటపుడు దత్తూర(ఉమ్మెత్త) సుమాన్ని సుమంగా చూడకపోవటం సౌమనస్యం ఎలా అవుతుంది.

**సుమం దుత్తూరం త్వం కుసుమవిషయే స్పష్టమకరోః**
**గణానా మధ్యక్షోఽపి కుసుమ మిదం సంస్పృహయతే।**
**వయం వన్దామో ద్వా వపి తు కుసుమం తన్న చినుమః**
**కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥** (శ్లో 34)

జగత్తును వివిధ పదార్థాలలో, వికల్పాలతో కలుషితం చేయక, అదీ పరబ్రహ్మమే అని భావించడం, ఆరాధించడం సుపథం. విపర్యయాలు వికల్పాలు కూడా ఇంద్రధనుస్సులో, నానా వర్ణాలను ఆస్వాదించడం లాంటివే. ఆనందానుభూతికి దగ్గర చేస్తూ, పరమానంద సమీక్షకు

చైతన్యవంతులను మరల్చడం తత్త్వశాస్త్ర ఉద్దేశ్యం. తదనుగుణంగానే యాథార్థ్యావగాహన మార్గంలో ఏ వేదాంతనిర్ణయమైనా, ఉపదేశమైనా ఉండాలని భావించడం ఆచరణీయం. భిక్షుకుడిని సైతం శిక్షకుడిగా మలచుకుని పురోగమించేందుకు ప్రోత్సహిస్తున్న వాఙ్మయం మరో పార్శ్వంలో నిష్క్రియతను ఉదాసీనతను నెత్తెనపెట్టుకోవటం విరుద్ధంగా వైపరీత్యంగా గోచరిస్తుంది కదా.

**త్వదీయా దివ్యాభా దినకరనిశాకాన్తగలితా**
**విసర్పన్తీ విశ్వం ప్రతికణరసోద్దీపనచణా।**
**వయం వ్యాఖ్యామ స్త్వాం గుణవిరహితం కార్యరహితం**
**కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥** (శ్లో 35)

నిష్క్రియత ఉదాసీనత కాదు. ఉదాసీనత కార్య నిర్వహణదక్షతకు సరైన కొలమానం, నిష్క్రియతకు కాదు. శాస్త్రాలను అడ్డుపెట్టుకుని నిష్క్రియతను ఉదాసీనతగా ప్రకటించుకుంటూ పరోపదేశమే లక్ష్యంగా పెట్టుకుని జీవిస్తున్న విద్వద్వర్యులు పరోక్షంగానే కాదు ప్రత్యక్షంగానే ప్రేరకులు అవుతున్నారు ఇటువంటి నిష్క్రియాపరతకు.

లిప్తకాలం ఉండి నశించే బుడగలకు, లేకుండానే ఉన్నట్టు భ్రమింప చేసే హరివిల్లుకూ ఇంద్రియాలనూ, మనస్సునూ ఉల్లాసింపజేసే గుణం కలిగి ఉన్నపుడూ పరిణామరూపమై నిత్యనూతనంగా ఉన్న జగత్తును ఎందుకు నిస్సారంగా, నీరసంగా చిత్రీకరించాలి. బోధనలకు, సాక్షాత్కారానికి మధ్య ఎన్నో ఆవరణలు ఉండడం వలన యాథార్థ్యావగహానికి పరిమితులున్నాయి. ఆ విధమైన ఆవరణలు, ఆలోచనాధోరణులు, ఆచరణల్లో వైపరీత్యాలు ఈ రచనకు ప్రేరణలని ఈ గ్రంథంలో ప్రతివాక్యం విశదపరుస్తోంది.

**సతి బ్రహ్మజ్ఞానే తదితరసమస్తం తుష ఇహ**
**సమర్చాసంధ్యానే భజన మథవా యోజనమపి।**
**వినీయోగాభావే పరమవి దపి వ్యర్థపదవీ**
**కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥** (శ్లో 75)

బ్రహ్మజ్ఞానం ఆలోచనలో ఆచరణలో మృగ్యమైతే వినియోగంలో విస్తరించని పక్షంలో ఏ పదవి అయినా వ్యర్థమే కదా. అందువల్ల బ్రహ్మం

ఒక్కటే అనే అనుభూతిని ఆచరణలో పెట్టడం జ్ఞానుల ఏకైక కర్తవ్యమని భావించాల్సిన అవసరముంది.

**కరే కర్మప్రఖ్యం నివసతి మహత్ బ్రహ్మ పరమం**
**తతః ప్రాణీ కుర్వన్ జనహితవిధిం జన్మకలితమ్।**
**ఉపేయాదాత్మార్చాఫలమపి వయం కర్మవిరతాః**
**కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥** (శ్లో 77)

**జగన్మిథ్యా భ్రాన్తి శ్చల మచల మిత్యాదివిశయః**
**భవేద్వా జ్ఞానాంశః భవతి న ఫలం తేన కిమపి।**
**న యావద్దృష్టం తత్ వ్యవహృతిపదే నిత్యగమనే**
**కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥** (శ్లో 81)

కర్మ విరతి పరమజ్ఞానికి గుర్తింపు కాదు, తీసుకొనిరాదు. కర్మలను త్రికరణశుద్ధిగా చేశాక దాని నుండి వచ్చిన ఫలం పట్ల నిశ్చలమతిగా వుండటం కంటే ముక్తి, పరమానందం లేదన్నది అనుభవైకవేద్యం. ఈ అనుభవం సిద్ధించే వరకూ విపర్యయాలు, వికల్పాలు వెంటాడుతూనే ఉంటాయి.

మానవుని ఉన్మార్గగామిగా, సక్రియంగా ఉంచాల్సిన జ్ఞానాన్ని అనర్థక వైరాగ్య బోధనలతో, అనుభూతి ఔదాసీన్య ప్రేరణలతో, అనుచిత చర్చలతో అభివృద్ధి నిరోధకంగా మార్చక ఏదైతే అద్వైతదృష్టో అదే మోక్షపదవి అని, అద్వైతభావనయే ప్రత్యక్షంగా అంగీకరించి అనుభవిస్తూ జీవిస్తున్నంతకాలం మోక్షమే అనే తత్త్వబోధ ఈ గ్రంథ పరమలక్ష్యం.

**జగత్సాక్షీ సాక్షత్కరణపదవీ మేత్య సతతం**
**వ్రజత్యుచ్చై ర్నీచైరపి వియతి సర్వస్య జగతః।**
**కథం మిథ్యాభ్రాన్తిః కుత ఇహ జనక్రాన్తిహననం**
**కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥** (శ్లో 56)

**విముక్తైస్సర్వేభ్యః పునరపి సదాధారగమనే**
**విముక్తిర్భ్రాన్తిః స్యా దవిదితగురూత్తమమతిః।**
**యదద్వైతా దృష్టి స్తదు ఖలు భవేన్మోక్షపదవీ**
**కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥** (శ్లో 57)

జీవుణ్ణి విముక్తుడిని చేయడం కోసమే ఈ తాపత్రయం. అంటే అసలు జీవుడు ఎవరి చేతో బంధింపబడలేదు, ఆలానంలో ఏనుగులా స్వయంగానే బంధీ కానీ అసలు అతడు స్వయం ముక్తుడే అనే అవగాహన కలిగించడంలో ఈ గ్రథం పరిపూర్ణంగా సఫలం. ఇతరత్రా గ్రంథపఠన ఆవశ్యకతని తగ్గింస్తుందనడంలో సందేహం ఉండనవసరం లేదు.

జీవికి బంధహేతువు సృష్టి ప్రణాళికా ఆహంకారిక కర్మసూత్రమా అనేది నిర్ధారించడం కష్టమనీ గీతాచార్యులు *కర్మణో గహనా గతిః* (4 -16,17) అని సూచించాడు. సుఖానుగుణ రాగం, దుఃఖానుగుణ ద్వేషమే జీవుని 'బ్రహ్మం' నుండి బొమ్మగా విడివడి, దూరంగా జారిపడి తిరిగి చేరుకునే దశ అసంభవంగా చేస్తున్నాయి అని శాస్త్రజ్ఞుల బోధన. దీనిని గమనికలోకి తెచ్చుకోవడంకోసం ఉన్న మార్గాలవైపు తదేక దృష్టి అవసరం. వ్యావహారికత దీనికి అడ్డు రాకుండా చూసుకోగలిగితే నిర్మలీకరణద్వారా జీవుడు పరమాత్మ ప్రతిబంబత్వాన్ని తనలో సులభంగా చూడగలుతాడు. 'స్వ' స్థితిని 'స్వ'స్థతను పొందుతాడు.

పరమాత్మ సంకల్పరూపమైన దర్పణంలో దేశకాలాది ప్రమేయాలలో ఏర్పడ్డ ప్రతిబింబ వైచిత్రివల్ల బింబ సారూప్య సామీప్యాదుల్లో వచ్చిన మార్పులు చేర్పులు దూరం పెరగడానికి కారణాలు. ఈ ఎరుకలోకి జీవుడు రాగలిగితే, శత్రుత్వ మిత్రత్వాదులను త్యజిస్తే, సుఖ దుఃఖ విభాగాలను ఏకీకరిస్తే 'అంతా ఒక్కటే' అనే అద్వైతసిద్ధి కలుగుతుందనే ఈ వైతాలిక బోధ. అప్పుడు ఏడక్కరలేదు మూడే చాలు అనడానికి మనకు ప్రమాణాలు ఉన్నాయి. ఉపనిషత్తును అనుసరిస్తే అంతకూడా అవసరం లేదు. ఏవి పాకుడురాళ్ళో గమనించి సామాజిక బాధ్యతతో విశదీకరిస్తున్న వైశారద్యాన్ని అందుకోవడం కోసం మరి ఇకనైనా నిర్మలినీకరణకు ఉపక్రమించుదాం.

*తిలే తైలవత్ వేదాంతః సంప్రతిషితః* (ముక్తిః 1-9) అన్నట్లు ప్రతిశ్లోకంలో, పదాలలో, ప్రత్యయాలలో క్షీరసాగరమథన ఫలంలా జ్ఞానవనీతం నిండుగా ఉంది. ఆస్వాదించడానికి అవసరమైన ద్రవిణం ...మనకు ఉంటే సఫలత స్వతః సర్వతః సిద్ధమే.

'క్షేమః కథ్యః సకల జనుషామ్'

.... కలసి పయనిద్దాం

మీ **సత్యనారాయణ**

**Dr. Rani Sadasiva Murty**
Dean of Academic Affairs, Professor,
Department of Sahitya, National Sanskrit university, Tirupati
Coordinator for Ancient Indian Management Programme

---

# शुभाशंसनवचांसि

वेदान्तमण्डनापरनामकः धातुप्रश्नः मया आद्यन्तमवालोकि। धात्रा धात्रे कृतोऽयं सामवायिकः प्रश्नः। एकः श्लोकविधाता। अन्यः लोकविधाता च। नवनवतिश्लोक-समन्वितेऽसिन् मुक्तकमौक्तिके "कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ" इति प्रश्नोऽनुवर्तते प्रतिश्लोकम्। संशयास्तु नवनवति प्रकारकाः। तदनु प्रश्नस्तु एक एव। शिखरिणीवृत्तबद्धः प्रबन्धोऽयम् कवेर्भविवैशद्यस्य शिखरायते।

मोक्षवैमुख्यगामीव भाति कविरारम्भश्लोकेषु। विधात्रा सृष्टस्य विश्वस्य पुनरावृत्तिस्वभावः कविमेवं प्रष्टुं प्रेरयति। नित्यपरिणामशीले जगति विद्यमानाः लोकासर्वे पौनःपुन्येन जायन्ते प्रकृत्यां लीयन्ते च। तादृशि जगति जातानां जनानां मोक्षेच्छा किमर्थमिति इयं मोक्षेच्छासृष्टिः विधातुः सृष्टिरचनाकर्तृत्ववैफल्यमेवेति धिया कवेः पप्रच्छा।

तृतीये श्लोके जगदिदं परमात्नोरेव रूपमिति ततः ये अस्मच्छब्दवाच्याः मोक्षोप्सुकमानसास्सन्ति ते जगतो वा परमात्मनो वा मुक्तिव्याजेन पार्थक्यमिच्छन्तीति कवेस्संशयः वेदान्तपूर्वपक्ष इव द्योतते।

अनेन क्रमेण नवनवतिश्लोकेषु जगतः, परब्रह्मणः, जीवानां च स्वभावभेदबहुलतां, विपुलतां, विकलतां च सुस्पष्टभणितिष्वाविष्कृत्य जगत्सत्यं जगद्ब्रह्म जीवोऽपि ब्रह्ममये जगति भाग एव स्यादिति ये आधुनिकाः वादोत्सुकाः भवन्ति तथा तद्वादप्रोद्बलकदिशा प्रकटय्य नवनवतितमे चरमे श्लोके स्वाध्यायप्रवचनयोः, तपसि च सर्वेषां धीः प्रसरेदिति यदि तथा प्रसरति तदा ब्रह्मजगतोः, जीवजगतोश्चाभेददृष्टिरुदेतीति च प्रतिपादयति कविः।

प्रसिद्धवेदान्तप्रस्थानातिरिक्तमार्ग इव भासमानेऽस्मिन्ननन्तस्सारः कीदृश इति ज्ञातुं जिज्ञासुभिः कविरेवोपास्यः, समाश्रयणीयश्च।

कविविद्वद्वल्लभेन **श्रीमता डा.सूरं श्रीनिवासुलुमहोदयेन** ग्रथितोऽयं मुक्तकप्रबन्धः **श्री सूरं चन्द्रशेखरमहोदयस्य** सरलान्ध्रतात्पर्येण, **डा. पालपर्ति श्यामलानन्दप्रसादवर्यस्य** अच्छान्ध्रपद्य-रूपानुसृजनया च संवलितस्सन् त्रिभुवनतत्त्वप्रासद इव, त्रिपथगामिनीमार्ग इव च भासते।

अत्र सततं श्रीश्यामलाम्बाचरणारविन्दालयभूतहृदयानां कविदिग्गिभेन्द्राणां श्री पालपर्ति श्यामलानन्दप्रासादवर्याणां अच्छान्ध्रपद्यरूपानुसृजना शतकस्यास्य हेम्नः परमामोद एव। प्रतिपद्यमपि मूलकर्तुः हृदयाविष्करणे दर्पणायते।

शतकबन्धोऽयं सर्वजनमनोऽभिरामः भवतु अलीकमोक्षेच्छाविमूढचित्तानां, भ्रान्ति-भ्रमन्मतीनां तत्त्वहृदयविविदिषाविदिशावलम्बिनां सदालम्बनभूतो भवत्विति आशंसया विरम्यते।

बुधजनविधेयः

***राणि सदाशिवमूर्तिः***

# धातृप्रश्नः अथवा वेदान्तमण्डनम्
## ధాతృప్రశ్నః అథవా వేదాన్తమణ్డనమ్

**1**

अनन्ता लोका ये पुनरपि भवायैव भवता
विशिष्टा स्संसृष्टा वयमिह पुनर्जातिविकलाः ।
कथं मोक्षासक्ताः कथमपि भवाक्रोशपरमाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అనన్తా లోకా యే పునరపి భవాయైవ భవతా
విశిష్టా స్సంసృష్టా వయమిహ పునర్జాతివికలాః।
కథం మోక్షాసక్తాః కథమపి భవాక్రోశపరమాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

అనంతమైన ఈ లోకాలు మళ్ళీ పుట్టాలనే (పునరుత్పత్తి ఉండాలనే) ఉద్దేశంతోనే నీచేత విశిష్టంగా సృష్టించబడ్డాయి. మేమేమో ఇక్కడ పునర్జన్మ విషయంలో వికలులమవుతున్నాము. మాకంతా ఈమోక్షాసక్తి ఎలా ఏర్పడింది? ఈ సంసారాన్ని నిందించడంలో పరమాసక్తి ఎలా కలిగింది? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి ముగింపే లేకుండన్ మనిపెదవుగా మొత్తమెపుడున్
తెగోదారుల్ మేమై కలుగదగదింతే తగు నటం
చు గొప్పల్ గప్పాలాడెద మెద నిదే జుట్టుచు బళీ!
తెగింపున్నట్లో తాత! మము నిటు గూర్తే చెదరితే?

# 2

सिसृक्षा चित्ते तेऽविकलसकलाम्नायकलमा
विकीर्णा सत्प्रेम्णा जगदधि रसासारकरुणा ।
वयं भूयो भुयोऽ प्यनुचितविरक्तिप्रवचनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సిసృక్షా చిత్తే తేఽవికలసకలామ్నాయకలమా
వికీర్ణా సత్ప్రేమ్ణా జగదధి రసాసారకరుణా।
వయం భూయో భూయోఽ ప్యనుచితవిరక్తిప్రవచనాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

సకల వేదాలు అనే వాడనిపైరు నీ హృదయంలోని సిసృక్ష (సృష్టించాలనే కోరిక). అది రసవంతమూ, అపారమూ అయిన కరుణా స్వరూపం. ఈ ప్రపంచంమీద మంచి ప్రేమతో దాన్ని వెదజల్లావు. కానీ, మేమేమో పదేపదే అనుచితమైన విరక్తి గూర్చి మాటాడుతుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి బలేగా పుట్టింపం దొలినుడిబదుల్ వ్రాసి యటులే
వెలుంగన్ మా యందున్నెనరొలుక నీవే పెనచెదే
చులాగ్గా మేమేమో పెడసరముగా జోగులవలెన్
రలాయింపన్ తాతా! తలపొగరుమాటల్ చెదరితే?!

# 3

अणुव्यापि क्वापि प्रभवति पृथक्त्वे न भवितुं
वियुक्तिः कस्मान्नः न हि परमतो नाऽपि जगतः ।
निराधारा मुक्तिर्भवति जगत स्तत्त्वकथनात्
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అణువ్యాపి క్వాపి ప్రభవతి పృథక్త్వే న భవితుం
వియుక్తిః కస్మాన్నః న హి పరమతో నాఽపి జగతః।
నిరాధారా ముక్తిర్భవతి జగత స్తత్త్వకథనాత్
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

జగత్తు అంతా అణు సమ్మేళనంతోనే వివిధ రూపాలను పొందినపుడు, విడిపడి వుండే అవకాశం ఎక్కడా ఉండదు. కాబట్టి మనం వియోగం (విడిపడి ఉండడం) దేని నుండి కోరుతున్నాం? పరమాత్మ నుండా? లేక జగతి నుండా? జగత్తే పరమాత్మ రూపం అయినప్పుడు మేము ఆశించే ముక్తి ఉభయరీతులలోనూ కుదరదు గదా! అలాంటప్పుడు ముక్తి అనేదే నిరాధారమవుతోంది కదా.. ఓ విధాతా! సృష్టి గతివిషయంలోనువ్వు ఎందుకు విఫలుడవవుతున్నావు ఇలాంటి స్థితిని కలిగిస్తూ?

## అచ్చతెనుఁగు

తే.గీ. సన్ననలసులముద్దలై యున్నదెల్ల
ఎచేటినుండైన వేరుగా నెట్టులుండు
నెలవులేని విడుదలయుండెనని చెప్పు
పుట్టుకిడితివి తాత తప్పు జరిగినదొ?!

# 4

विलक्षाणि द्रव्या ण्यनुगतगुणाधीनगणना
न्यटन्ति प्रख्यातिं च सदसदभिध्यानविधुराम् ।
वयं मूढा दोषो गुण इति विभागेन निहताः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

విలక్షాణి ద్రవ్యా ణ్యనుగతగుణాధీనగణనా
న్యటన్తి ప్రఖ్యాతిం చ సదసదభిధ్యానవిధురామ్।
వయం మూఢా దోషో గుణ ఇతి విభాగేన నిహతాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ద్రవ్యాలు విలక్షణాలు, తమతో నియతంగా కూడి ఉండే గుణాలకు అధీనాలై ప్రసిద్ధిని పొందుతున్నాయి. సత్తు, అసత్తు అనే అభిధ్యానం లేనటువంటి ప్రఖ్యాతిని పొందుతున్నాయి. మేము మాత్రం మూఢులమై ఇది దోషం, ఇది గుణం అని విభజన చేసుకొని పాడైపోయాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

తే.గీ. దేనితనము దానిగొనముగా నలుగడ
నొక్కటే తీరుగా నన్ని యొప్పుచుండ
వెడగులము మంచిచెడులుగ వేరుసేయు
పుట్టుకిడితివి తాత! తప్పు జరిగినదొ?

# 5

बहु स्या मेकोऽहं कथमिति विचिन्त्यैव बहुधा
त्वयानेकत्वार्थं कृतमु सुकृतं तैजसमिदम्।
तमो भ्रान्त्या भीता वय मसदि संस्तारणरताः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

బహు స్యా మేకోఽ హం కథమితి విచిన్త్యైవ బహుధా
త్వయానేకత్వార్థం కృతము సుకృతం తైజసమిదమ్।
తమో భ్రాన్త్యా భీతా వయ మసది సంస్తారణరతాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

"ఒక్కడినైన నేను ఎక్కువగా కావాలి" అని అనేక రీతులుగా ఆలోచించి నువ్వు అనేకత్వం కోసం తేజస్సంబంధమైన ఈ లోకాన్ని చక్కగా సృష్టించావు. మేమేమో తమస్సు అనే భ్రాంతి వల్ల ఈ సంసారాన్ని లేని చీకటిగా భావించి దాటిపోవాలనే చూస్తుంటాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

తే.గీ. ఒకఁడ పెక్కగుటెట్లని యొనరనెంచి
పలువెలుంగులుగా నీవ బ్రతుకనేర్చి
లేని చీకటి కడలెడి లెంకలమగు
పుట్టుకిడితివి తాత! తప్పుజరిగినదొ?

# 6

अकूपारेऽपारेऽपरिमितरसे भङ्गविरसे
प्यकुण्ठास्तीच्छा ते कृतिरपि तथा जीवनपरा ।
अपादानेऽस्पष्टे कथमिह वयं मुक्तिफलकाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అకూపారేఽపారేఽపరిమితరసే భంగవిరసే
ప్యకుణ్ఠాస్తీచ్ఛా తే కృతిరపి తథా జీవనపరా।
అపాదానేఽస్పష్టే కథమిహ వయం ముక్తిఫలకాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

అపరిమితమైన జలంతో అంతులేని లోతుతో ఉండి అలలతో (భంగపాటుతో) విరసమైన సముద్రవిషయంలో కూడా నీ ఇచ్ఛా, ప్రయత్నమూ అకుంఠమైనవి. (దానని భంగపాటు నుండీ బయట పడవేయాలని ప్రయత్నం జరుగుతూనే ఉంది). అవి జీవనపరమైనవి. కానీ మేము అపాదానాస్పష్టత (దేనినుండీ విడిపోవాలో స్పష్టంగా తెలియకపోవటం) ఉన్నా ముముక్షు ఫలకాలను మెడలో తగిలించుకొని తిరుగుతుంటాం.

## అచ్చతెనుఁగు

శిఖరిణి తుదే కానన్ రానట్టి కడలి నలల్ తోపని యటుల్
మదిన్ బాగైయుండన్ వెదకెద వెదోమార్పు నటులే
ఎదో తెల్లంబౌ మా విడుపు నెటకో ఏమెఱుగకే
ఎదన్ తాతా! తాల్పన్ విడుపుపలకెంతే చెదరితే

# 7

बुभुक्षामुक्तीच्छे धृतिशमदमा नैव परमाः
स्वयं यान्त्येवान्ये प्रकटितभवा बान्धवजनाः ।
रसीभूतं चेतोऽ नुभवति परं ज्ञातविषयम्
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

బుభుక్షాముక్తీచ్ఛే ధృతిశమదమా నైవ పరమాః
స్వయం యాన్త్యేవాన్యే ప్రకటితభవా బాన్ధవజనాః।
రసీభూతం చేతోఽ నుభవతి పరం జ్ఞాతవిషయం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

బుభుక్ష, ముముక్ష, ధృతి, శమం, దమం ఇవేవీ గమ్యాలు కావు, మార్గాలు మాత్రమే. అందుకే స్థిరాలు కావు. పుట్టుకను బట్టి వచ్చిన బంధువులూ తమంత తామే వెళ్ళిపోయేవారే. విషయజ్ఞానంతో చిత్తము రసీభావాన్ని (రసో వై సః - తైత్తరీయోపనిషత్తు) పొందినప్పుడే ఆత్మానుభూతిని మేము పొందగలం. విధాతా! సృష్టిగతి కొనసాగించే విషయంలో నువ్వెందుకు విఫలుడవుతున్నావు.

## అచ్చతెనుఁగు

శిఖరిణి తినన్ పోవన్ కోర్కుల్, కుదురు, మది మై తిన్నదనమున్
చనంగా దారుల్ తప్ప గుటి యన నౌనా? యటులె మే
ననౌ బందుల్ పోకల్ తెలియవలె తా నాతడెవరో
ననంగా తాతా! గుండెతడివలె నౌనా? చెదిరితే?

## ৪

स्वतो नाशी देहोऽटति च समयेह्यध्रुवतया
स्थिरो ह्यात्मा यावद्भवति जगतः प्राणनविधिः ।
वयं मुक्त्यत्युच्चाः कथमिह कुतो वा जडधियः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

స్వతో నాశీ దేహోఽటతి చ సమయేహ్యధ్రువతయా
స్థిరో హ్యాత్మా యావద్భవతి జగతః ప్రాణనవిధిః ।
వయం ముక్త్యత్యుచ్చాః కథమిహ కుతో వా జడధియః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ ॥

### తాత్పర్యం

శరీరం నశించే స్వభావం కలది. కాలం గడుస్తుంటే అది తనంతట తానే నశిస్తుంది. ఆత్మ శాశ్వతమైనది. ఈ జగమున్నంతవరకూ ఆత్మ ఉంటుంది. కానీ మూఢులమైన మేము ముక్తి దేని నుండియో, అది ఎలాగో తెలియకుండానే ముక్తి గురించి గొప్పగా మాటాడుతుంటాం. విధాతా! సృష్టిగతి కొనసాగించే విషయంలో ఇలా నువ్వెందుకు విఫలుడవౌతున్నావు?

### అచ్చతెనుఁగు

తే.గీ. బొమ్మ ఎన్నటికైనను పోవునదియె
బమ్మ ముందునట్టిదియె ఎప్పటికినైన
విడుపు నెటనుండొ ఎఱుగక వేడునట్టి
పుట్టు కిడితివి తాత! తప్పు జరిగినదొ?!

# 9

गतीरूपः पादे भवति मनुजस्येह परमः
पुरोगन्ता शश्वद्व्रजति परमे शाश्वतमतिः ।
अनालब्धज्ञाना वयमिह सदा क्वापि मृगणाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

గతీరూపః పాదే భవతి మనుజస్యేహ పరమః
పురోగన్తా శశ్వద్వ్రజతి పరమే శాశ్వతమతిః।
అనాలబ్ధజ్ఞానా వయమిహ సదా క్వాపి మృగణాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఈ లోకంలో పరమాత్మ గతి(నడక) రూపంలో పాదాలలో ఉంటాడు (గతి రితి పాదయోః - తైత్తరీయోపనిషత్తు). కావున నిత్యగమనశీలుడైనవాడు ఎప్పుడూ పరమాత్మ యందు స్థిరంగా మనస్సును లగ్నం చేసినవాడే అవుతున్నాడు. మేమూ జ్ఞానం పొందక ఎప్పుడూ నీ కోసం ఎక్కడెక్కడో వెతుకుతుంటాం. విధాతా! సృష్టిగతి కొనసాగించే విషయంలో నువ్వెందుకు విఫలుడవవుతున్నావు.

## అచ్చతెనుఁగు

చం. కదలిక నొప్పు కాళులనె కానగవచ్చును పెద్దయంచు చె
ప్పెదవన సాగువాడెపుడు పెద్దఁదలంపున నిల్పినట్లె మా
కది ఎఱుగంగరాకెపుడు నక్కడ నిక్కడ చూచుచుందుమౌ
నిది తమ చేతయే చెదిరితే? మము చేయుచు తాత! పోతలో

# 10

महात्मा यो विश्वं विदधति निजेच्छाप्रकटितम्
तदीयो ह्यावासो मनुजवचसि क्षेमपदकः ।
अतः कथ्यः क्षेम स्सकलजनुषाम् किन्तु विरसाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

మహాత్మా యో విశ్వం విదధతి నిజేచ్ఛాప్రకటితం
తదీయో హ్యావాసో మనుజవచసి క్షేమపదకః।
అతః కథ్యః క్షేమ స్సకలజనుషాం కిన్తు విరసాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

పరమాత్మ తన యొక్క కోరికను అనుసరించి సృష్టించిన ఈ విశ్వమున వాచకంలో క్షేమ రూపంలో వున్నాడు (క్షేమ ఇతి వాచి). కావున మేము సకల జనులకు క్షేమాన్ని గూర్చే పలుకుతుండాలి. కానీ మేము అలా చేయక విరసులమై వున్నాము. విధాతా! సృష్టి కొనసాగించే విషయంలో ఇలా నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

తే.గీ. లోనివెల్గు సేమపుపల్కులోననుండు
కాన నెపుడు సేమమె పలుకంగవలయు
కాని చెడునుడులాడు నాల్కగల పాడు
పుట్టువిడితివి తాత! తప్పు జరిగినదొ?!

# 11

कुतश्चाविर्भूताः कुह समुदिताः किन्नु करणं
कदा वा सञ्जाताः किमधिकरणं किन्नु फलितम् ।
न जानीमः किन्तु प्रचलनपराः क्वापि जगतः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

కుతశ్చావిర్భూతాః కుహ సముదితాః కిన్ను కరణం
కదా వా సంజాతాః కిమధికరణం కిన్ను ఫలితమ్।
న జానీమః కిన్తు ప్రచలనపరాః క్వాపి జగతః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

దేని నుండి పుట్టామో, ఎక్కడ పుట్టామో, కరణం (సాధనం) ఏమిటో, ఎప్పుడు పుట్టామో, దానికి ఆధారమేమిటో, దాని ఫలితమేమిటో... ఇవేవీ మాకు తెలియవు. కానీ ఎప్పుడూ ఈ జగత్తు నుండి ఎక్కడికో పారిపోవాలని చూస్తుంటాము. విధాతా! సృష్టిగతి కొనసాగించే విషయంలో నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

తే.గీ. ఎచేటినుండెట దేనితో నెపుడు పుటక
దానివెరవు రాబడియు సుంతేని ఎఱుఁగ
మెటకొ పారిపోజూచెద మిట్టిమెలిక
పుట్టుకిడితివి తాత! తప్పు జరిగినదొ?!

# 12

जगज्जातं जातं गुणगणसमक्तं निरुपमं
समक्नं कालेषु स्वककृतिपरं त्यक्तविरति ।
वयं लोकस्यास्य स्थगनविषये लग्नधिषणाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

జగజ్జాతం జాతం గుణగణసమక్తం నిరుపమం
సమక్నం కాలేషు స్వకకృతిపరం త్యక్తవిరతి।
వయం లోకస్యాస్య స్థగనవిషయే లగ్నధిషణాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఈ జగత్తు రూపంలో పుట్టినదంతా గుణగణాలతో విడదీయరానంతగా కూడుకున్నది, సాటిలేనిది. అన్ని కాలములలో గమనశీలమైనది. తనదైన కర్తవ్యంలో లగ్నమైనది. మేము మాత్రం ఈ లోకాన్ని నిలిపివేయాలనే బుద్ధిని లగ్నం చేస్తున్నాము.. విధాతా! సృష్టిగతి కొనసాగించే విషయంలో నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు??

## అచ్చతెనుఁగు

మ. పుడమింబుట్టెడివెల్ల మేల్గొనములన్పోల్పంగలేనట్టివై
తడబాటేమియు లేక సాగునుగదా తామెప్పుడున్ [1]సడ్డగా
వడిగా నంతటి నాపివేయు తలపుల్ పర్వెత్తు మా బుజ్జలం
దిడినావీవనిపించు పుట్టుకను మాకీ వంకరల్ తాతయా!

1. సడ్డ = శ్రద్ధ

# 13

प्रवृत्तिर्नो तस्मिन् यदि परमके नास्ति हि जगत्
निवृत्तिं मन्तारस्त्वपसृततदीयाध्वगमनाः ।
तदर्चाभूयांसः पुनरपि तदीयाग्निजलदाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

ప్రవృత్తిర్నో తస్మిన్ యది పరమకే నాస్తి హి జగత్
నివృత్తిం మన్తారస్త్వపసృతతదీయాధ్వగమనాః।
తదర్చాభూయాంసః పునరపి తదీయాగ్నిజలదాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

పరమాత్మకు ప్రవృత్తి లేకపోతే ప్రపంచమే లేదు. మేమేమో నివృత్తి వైపే దృష్టి పెట్టి ఆయన మార్గం నుండి మేము మా నడకను తప్పిస్తున్నాము. ఆయనకు పూజలు చేస్తూనే, ఆయన జ్యోతి (సూర్యుడు, నిప్పు) పాలిటి మేఘాలమై ప్రవర్తిస్తుంటాము. విధాతా! సృష్టిగతిని కొనసాగించే విషయంలో నువ్వెందుకు విఫలుడవుతున్నావు?

## అచ్చతెనుఁగు

ఉ. పెద్దకు [1]సాగు కల్గుటనె వెల్వడె నెల్లయు పెక్కురూపులన్
ముద్దయె విచ్చు నాగినను మ్రొక్కుచు వానికి [2]నాగు టొక్కటే
అద్దరియంచు మబ్బులయి అడ్డగ వత్తుము వాని వెల్గుకున్
దిద్దగరాదటే చెదిరితే? మము చేయుచు తాత! పోతలో

1. సాగు = ప్రవృత్తి, 2. నాగు = నివృత్తి

# 14

महीरुट्संविष्टोऽ नुभवति फलं कश्चन खगः
दिदृक्षासंतुष्टस्त्वपर इह दृष्टोऽस्ति रसिकः ।
अवश्यम्मान्यौ तौ परमिह वयं साक्षिगणनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

మహీరుట్సంవిష్టోఽ నుభవతి ఫలం కశ్చన ఖగః
దిదృక్షాసంతుష్టస్త్వపర ఇహ దృష్టోఽస్తి రసికః।
అవశ్యమ్మాన్యౌ తౌ పరమిహ వయం సాక్షిగణనాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఒక పక్షి చెట్టుపై కూర్చొని ఆనందంతో ఫలం తింటూ ఉంటుంది. రెండవ పక్షి రసికుడై దిదృక్షతో ఆనందిస్తుంటుంది. రెండూ కూడా గౌరవింపదగ్గవే. కానీ మేము సాక్షిగా ఉన్నవానిని మాత్రమే గొప్పగా భావిస్తుంటాము. విధాతా! సృష్టిగతిని కొనసాగించే విషయంలో నువ్వెందుకు విఫలుడవుతున్నావు?

## అచ్చతెనుఁగు

ఆ.వె. పక్కిదోయి కొమ్మపయి పండు నొక్కటి
తినుచునుండ నొకటి కనుచునుండె
తినెడిదాని వదలి కనెడిదానిన మెచ్చు
పుటుకలందు బమ్మ! కిటుక కదేమొ?

# 15

धनेच्छा दारेच्छा मधुरसपिपासा जिगमिषा
भवेन्नामैवं वागनुचितकृती बंधकृतधीः ।
जिघांसा सर्वासां कथमिह जगन्मान्यसरणिः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

ధనేచ్ఛా దారేచ్ఛా మధురసపిపాసా జిగమిషా
భవేన్నామైవం వాగనుచితకృతీ బంధకృతధీః।
జిఘాంసా సర్వాసాం కథమిహ జగన్మాన్యసరణిః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ధనము కావాలనే కోరిక, భార్య కావాలనే కోరిక, తేనే, నీళ్లు తాగాలనే కోరిక, వెళ్లాలనే కోరిక, ఇలాంటి కోరికలను గురించి మాటాడే వాడు అనుచితకృతీ, బంధమతీ అయితే కావచ్చు. వీటన్నిటినీ చంపాలనే (అణచాలనే) కోరిక.. అది ఎలా గొప్పదవుతుంది (అదీ కోరికే గదా.. పైపెచ్చు ఇంకా పెద్దది కదా). విధాతా! ఇలా సృష్టిగతిని కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవుతున్నావు?

## అచ్చతెనుఁగు

కం. పెణ్ణాసయు కల్లాసయు
పొణ్ణాసయు గెల్పుటాస పొసగవని వడిన్
తన్నాస కూడ ఆస గ
దన్నా! నీ చేతబడులె అటుఇటు తాతా!

## 16

न ते दृष्टिः स्त्रीपुंविषयविषमा किन्तु समगा
नमन्ती तुष्यन्ती निजकृतिफलं वीक्ष्य विपुलम् ।
विधिं न्यक्कुर्वाणा वयमिह पुमाधिक्यकथनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

న తే దృష్టిః స్త్రీపుంవిషయవిషమా కిన్తు సమగా
నమన్తీ తుష్యన్తీ నిజకృతిఫలం వీక్ష్య విపులమ్।
విధిం న్యక్కుర్వాణా వయమిహ పుమాధిక్యకథనాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

నీ దృష్టి స్త్రీ, పురుషుల విషయంలో విషమంగా ఉన్నట్లు తోచదు. నీవు నీ కర్మ ఫలితంగా వున్న ఈ విశాల విశ్వాన్ని వినమ్రతతో గౌరవిస్తూ ఆనందిస్తూ ఉంటున్నావు. మేమేమో విధినే ధిక్కరిస్తూ పురుషులే గొప్పవారని మాటాడుతుంటాం. విధాతా! ఇలా సృష్టిగతిని కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవుతున్నావు?

### అచ్చతెనుఁగు

ఉత్సాహము ఆడయనుచు మగయటంచు నంతరువులు లేనటుల్
చూడవలె ననంగ నీవు చూతు వొకటిగా నయో!
ఆడ కన్న మగయె మిన్న యందు మేల మేమిటన్
ప్రోడవైన నీదు చేత పొరబడినదొ? తాతయా!

## 17

वयं वाङ्गाधुर्याः निजमतिसमानीतनिगमाः
विकुर्वाणा लोकं प्रवचनपरा श्छांदसधियः ।
त्वया सृष्टं सर्वं न भवति पवित्रं किमु हितं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

వయం వాఙ్మాధుర్యాః నిజమతిసమానీతనిగమాః
వికుర్వాణా లోకం ప్రవచనపరా శ్ఛాందసధియః।
త్వయా సృష్టం సర్వం న భవతి పవిత్రం కిము హితం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

మేము వాఙ్మాధుర్యంతో మా మతికి తోచినట్టు వేదపదాన్ని వినియోగిస్తూ ఛాందసబుద్ధులమై ప్రవచనాలు చేయటం మీద ఆసక్తి చూపుతున్నాం. నీవు సృష్టించిన ఈ విశ్వమంతా పవిత్రం కాదా? హితకరం కాదా? విధాతా! సృష్టిగతిని కొనసాగించటంలో నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు?

### అచ్చతెనుఁగు

కం. తేనెల తేటల మాటల
ప్రానుడిగమి నడ్డుపెట్టి పలికెద మెవియో
ఈ నీ తీర్చిన దానం
గానిది యున్నే? పుటుకల కలచితె? తాతా!

# 18

समारब्धाकल्पो न हि विरमसे नित्यरमणः
प्रकृत्या संतुष्ट स्तदुपगतिकं कर्म कुरुषे ।
असंतृप्ता दृप्ता विकृतिगतयश्चात्र हि वयं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సమారబ్ధాకల్పో న హి విరమసే నిత్యరమణః
ప్రకృత్యా సంతుష్ట స్తదుపగతికం కర్మ కురుషే।
అసంతృప్తా దృప్తా వికృతిగతయశ్చాత్ర హి వయం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

కల్పన ప్రారంభించావు. మళ్ళీ ఆపలేదు. ఆ కల్పనతో నిత్యం ఆనందిస్తూ ఉంటావు.. ప్రాకృతికలక్షణాలతో తృప్తి చెందుతూ దానికి ఉపబలకమైన పనులే చేస్తుంటావు. మేమేమో అసంతృప్తులము., గర్వంతో, వికృతగతి కలిగినవారము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

ఆ.వె. చేత మొదలుపెట్టి చేయుచునేయుందు
వాపకుండ మెత్తు వదియె యెపుడు
మార్పనెంచు పొగరు మాకెట్లువచ్చెనో
తాత! పొరబడితివొ? చేతబడిని

## 19

अभिन्ने भिद्भावा भिदि पुनरभिन्नत्वकथनाः
वयं नष्टाशिष्ठाः स्वमतिपरमार्थीकृतधियः ।
कथं भिन्नो विश्वात् वद कथमभिन्नस्स्वसृजनात्
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అభిన్నే భిద్భావా భిది పునరభిన్నత్వకథనాః
వయం నష్టాశిష్ఠాః స్వమతిపరమార్థీకృతధియః।
కథం భిన్నో విశ్వాత్ వద కథమభిన్నస్స్వసృజనాత్
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

అభిన్నంలో భేదాన్ని చూస్తుంటాం. భేదముండే చోట అంతా సమానమంటాం. మేము ఆశిష్ఠులను కోల్పోయినవారం. మా గమనాన్నే పరమార్థంగా భావించే బుద్ధి కలిగినవారం. నీవు విశ్వం కంటే భిన్నుడవెలా అయ్యావు? నీ సృష్టి కంటే అభిన్నుడవెలా అయ్యావు?, చెప్పు. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

చం. ఒకటిని వేరు వేరనుచు ఒక్కటి యంచును వేరు వేరులన్
తికమక నందుచుండియు అదే సరి యందుము మంచి చెప్పు వా
రికి కదుదవ్వు నయ్యెదము రేకులువిప్పి వెలుంగు నీదు చే
తకు మరి నీకు వేరడియొ దానన యుంటివొ? తాత! తప్పెదో?

**20**

विभिन्ना अङ्गुष्ठा नयनवदने भिन्नचरिते
विशेषास्संभिन्ना मतिगतिनियुक्ताः प्रतिजनम् ।
अभिन्ना सृष्टिः स्यात् कथमिह भवेद्दृष्टि रभिदा
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

విభిన్నా అఙ్గుష్ఠా నయనవదనే భిన్నచరితే
విశేషాస్సంభిన్నా మతిగతినియుక్తాః ప్రతిజనమ్।
అభిన్నా సృష్టిః స్యాత్ కథమిహ భవేద్దృష్టి రభిదా
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

బొటనవేళ్లు భిన్నం. నయన, వదనాలూ భిన్నం. ద్రవ్యాలలో వుండే విశేషాలు అనంతాలు. ప్రతి వ్యక్తిలో ఆలోచనలు, ప్రవృత్తులు భిన్నంగా ఉంటాయి. అపుడు నీ సృష్టి అభిన్నమెలా అవుతుంది? దృష్టి లోనే అభిన్నత వుండి ఉండాలి. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

తే.గీ. వేలిముద్దరలవి వేరు కన్ముక్కులు,
దినుసులెన్నొ వానితీరువేరు
తలఁపునడతలన్నిదారులువేరుండ
చేత యొకటి యనెద తాత! సరియె

# 21

कथं रज्जौ सर्पभ्रम इति वचो विश्वविषये
कि मेष स्सर्वेषा मपि नियमतो बुद्धिजनितः ।
नियत्या राहित्ये कुत इह भवे न्मानगणना
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

కథం రజ్జౌ సర్పభ్రమ ఇతి వచో విశ్వవిషయే
కి మేష స్సర్వేషా మపి నియమతో బుద్ధిజనితః।
నియత్యా రాహిత్యే కుత ఇహ భవే న్మానగణనా
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ప్రపంచం రజ్జుసర్ప భ్రాంతి వంటిదే అనేది ఎలా కుదురుతుంది? ఆ సర్ప భ్రమ అందరిలో వ్యవహారహేతువైన జ్ఞానమా? నియతంగా దాని నుండీ పుడుతోందా? ఆ నియతి లేకపోతే దానిని ప్రమాణంగా ఎలా గుర్తిస్తాము? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవుతున్నావు?

## అచ్చతెనుఁగు

ఉ. త్రాడును చూచి పామనెడు దానికి పాము నెఱుంగగా వలెన్
చూడనివానికెట్లు మది సోకును పాపతలంపు లెల్లరున్
త్రాడును పాముగా తలచినం గొలగాఁగొననొప్పు నెట్టులీ
వీడని సందియం బెడద పెట్టితి తాత! రవంత తప్పితో?!

# 22

त्वमानन्द स्त्वत्तस्समजनि जगत् कार्यतनुकं
न वा स्यास्त्वं विश्वं सततपरमानन्दकरणम् ।
वयं हेतोः कस्मात् प्रतिपदविभिन्नाः अकहृदः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

త్వమానన్ద స్త్వత్తస్సమజని జగత్ కార్యతనుకం
న వా స్యాస్త్వం విశ్వం సతతపరమానన్దకరణమ్।
వయం హేతోః కస్మాత్ ప్రతిపదవిభిన్నా అకహృదః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

నీవు ఆనంద స్వరూపుడవు. కారణమైన నీ నుండీ కార్యశరీరంగా ఈ జగత్తు పుట్టినది. లేదా., నువ్వే జగత్తువు.. కాబట్టి నిత్యపరమానంద స్వరూపమే విశ్వం. కానీ, నీ నుండి పుట్టిన మేము ఎందుకిలా కారణలక్షణాలు కోల్పోయి ప్రతి పదములోనూ భిన్నులమై బాధాహృదయులమవుతున్నాం? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

తే.గీ. పులికిపులిపుట్టు పిల్లులు పుట్టబోవు
నిండుసంతసమైనట్టి నిన్ను నుండి
పుట్టినట్టి మేమేడ్తు మెప్పుడును తాత!
పుట్టుకల చేతబడిలోన పొరబడితివా?!

## 23

वयं नित्यानन्दास्त्वमिव विहिताः किन्त्वनुभवे
प्रतीबन्धः कोऽपि स्थगयति मनस्साधकतमम् ।
भवेस्तत्कर्ता त्वं वयमुत हता नो धिषणया
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

వయం నిత్యానన్దాస్త్వమివ విహితాః కిన్త్వనుభవే
ప్రతీబన్ధః కోఽపి స్థగయతి మనస్సాధకతమమ్।
భవేస్తత్కర్తా త్వం వయముత హతా నో ధిషణయా
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

నీలాగే మేమూ నిత్యానందులంగానే సృష్టింపబడ్డాం. అయితే ఆ ఆనందాన్ని అనుభవించడంలో సాధకతమమైన మా మనస్సుకు ఏదో ప్రతిబంధకం అడ్డువస్తోంది. ఆ ప్రతిబంధకానికి కారణం నువ్వా? లేక మా బుద్ధి చేత పాడైపోయిన మేమా? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శా. మేమున్నీవలె నెప్పుడున్ దనియుచున్ మేల్గాంచు నట్లే మమున్
సామీ! పుట్టుక దిద్ది నా వయిన దోసంబేదియో అడ్డుగా
ఈ మా తన్నును సాగనీయమికి నీవే యౌదువో మా తలం
పే మెల్వడ్డదొ? తాతయా! చెదిరితే ఈ దారి పుట్టింపులన్

## 24

त्वमस्राक्षीस्साक्षी त्रिजगदिद मन्योन्यसहकृत्
न कोप्यास्ते जन्तुः धृतनिजमते राप्तु मखिलम् ।
कथं कैवल्याप्तौ वयमिह परं लग्नधिषणाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

త్వమస్రాక్షీస్సాక్షీ త్రిజగదిద మన్యోన్యసహకృత్
న కోప్యాస్తే జన్తుః ధృతనిజమతే రాప్తు మఖిలమ్।
కథం కైవల్యాప్తౌ వయమిహ పరం లగ్నధిషణాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

నీవు సాక్షివై పరస్పర సహకారంతో ఉండేలా ఈ ముల్లోకాలను సృష్టించావు. ఈ లోకంలో ధైర్యంగా తన బుద్ధితోనే అంతా పొందగలిగిన ప్రాణి ఏదీ లేదు. కానీ మేము కైవల్యప్రాప్తి మీదనే మా బుద్ధిని లగ్నం చేస్తున్నాము. అదెలా కుదురుతుంది? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

తే.గీ. ఒకరికొకరు తోడ్పాటుగా నుండునట్లు
నీవు సాకిరిగా తీర్చినావు మమ్ము
నొకరుగా గెల్వలేమయ్యు నొడ్డుజేర
నొంటరిగ సామొనర్తు మేలోయి తాత!

न मे स्यादानन्दक्षतिरिति भवान् निश्चितमनाः
मुखादग्नेस्तोयावधि जगदिदं प्रीत मकरोत् ।
वयं विश्वाद्दूरे क्वचिदपि त दन्वेषणपराः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

న మే స్యాదానన్దక్షతిరితి భవాన్ నిశ్చితమనాః
ముఖాదగ్నేస్తోయావధి జగదిదం ప్రీత మకరోత్।
వయం విశ్వాద్దూరే క్వచిదపి త దన్వేషణపరాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

నీకు (అంటే మాకు) ఆనంద విఘాతం కలుగకుండా వుండాలని నువ్వు నిశ్చయించుకొని, నిప్పునుండీ నీళ్ళ దాకా ఈ జగత్తును ఆనందమయంగా సృష్టించావు. మేమేమో విశ్వానికి దూరంగా ఎక్కడో ఆనందాన్ని వెతకాలనుకుంటాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

మ. తనియన్ [1]చిట్టయు తెంపు కల్గని యటుల్ తా నిప్పులో నీట నిం
గిని గాలిన్ మరి నేల నన్నిటను [2]చేక్కిన్ పెట్టగా తన్నుకై
కనగానేరక దవ్వదవ్వులకు పోకల్ చేసి యద్దానినిన్
గొనగా చూతుము తాతయా! చెదిరితే? కూర్పంగ మమ్మిట్టులన్

1. చిట్ట = చిటికె, 2. చేక్కి = స్థావరము

## 26

क्रियासक्तस्वान्तः कथमितरथा नित्यकरणः
सिसृक्षुस्त्वं लोकाननुदिनविवृत्तान् वितनुषे ।
अनासक्तिश्रैष्ठ्यं वयमिह कथं ब्रूम विरताः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

క్రియాసక్తస్వాన్తః కథమితరథా నిత్యకరణః
సిసృక్షుస్త్వం లోకాననుదినవివృత్తాన్ వితనుషే।
అనాసక్తిశ్రైష్ఠ్యం వయమిహ కథం బ్రూమ విరతాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

నీవు కర్మల యందు ఆసక్తిగల మనసు గలవాడవు.అలా కాకుంటే నిత్యమూ కరణాలను దగ్గర పెట్టుకొని ఎందుకుంటావు? నీవు లోకాలను సృష్టిస్తూ ప్రతిదినమూ మరలుతున్నా వాటిని విస్తరింపజేస్తూనే ఉన్నావు. మేమేమో అనాసక్తతయే గొప్పదని చెబుతున్నాము, ఎలా? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ కూడా నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

తే.గీ. రేపుమాపులు మొత్తము రేఁబవళ్ళు
విడుపు చూపవుగా చేతబడులలోన
పుట్టుకల నెల్లెడల పనిముట్టులొప్ప
ఏమిపట్టనితనము మాకేల? తాత!

सता कर्त्रा साकं भवतु च जगद्देतुरहितं
स्वतो जातं यातु स्वयमथ मृतिं वा विलसितिम् ।
कुतः कार्याकार्यप्रगणनपराः स्याम च वयं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సతా కర్త్రా సాకం భవతు చ జగద్ధేతురహితం
స్వతో జాతం యాతు స్వయమథ మృతిం వా విలసితిమ్।
కుతః కార్యాకార్యప్రగణనపరాః స్యామ చ వయం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

జగత్తు సత్తు అయిన కర్తతో సహా హేతురహితంగా పుట్టినదే అనుకుందాం. తానంతట తానుగా పుట్టినది తనంత తానే మృతి చెందితే చెందనీ, లేదా ఎదిగితే ఎదగనీ.. ఇక మేమెందుకు ఇది కార్యమా, అకార్యమా అనే ఆలోచనలు చేస్తుంటాం? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి తనంతందానే ఎల్లపుడు మెయినొందంగలిగినన్
తనంతందానే పుట్టినది చననీ తానుగ బళీ!
తనంతందానే పెర్గిన పెరుగనీ తాత! యచటన్
గనంగానేలన్ మంచిచెడులను చక్కం దలఁపవో?

# २८

अिस द्वंद्वातीत स्सकलमपि ते तुल्यफलकं
पदार्था स्तद्धर्मा अपि विनिहिता द्वंद्वरहिताः ।
विभागैकासक्ताः कथमिह वयं भिन्ननयनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అసి ద్వంద్వాతీత స్సకలమపి  తే తుల్యఫలకం
పదార్థా స్తద్ధర్మా అపి వినిహితా ద్వంద్వరహితాః।
విభాగైకాసక్తాః కథమిహ వయం భిన్ననయనాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

నీవు ద్వంద్వానికి అతీతుడవు. సకలమూ నీకు సమానమైన ఫలముగలదే. నీ పనితనంతో పదార్థాలు, వాటి ధర్మాలూ ద్వంద్వరహితాలై దృఢంగా ఉంచబడ్డాయి. కానీ మేము మాత్రం విడగొట్టడం మీదే ఆసక్తి కలిగి భిన్నదృష్టితో చూస్తుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి  సరేనయ్యా! రెండన్నదియె యెట వీసంబయిన లే
దు రేపెట్టంబోవెయ్యెడ దిగుడులెత్తుల్ సరిగనే
కరాఖండిన్ బుట్టింతు వొకటిగ నింకన్ గను మమున్
తఱుల్ దారుల్ చీల్పన్ వెదకెదము తాతా! చెదిరితే?

# 29

प्रियानंदस्त्वं तत् क्षतिमपि विशंक्यैव मनसा
प्यकार्षी र्वा यत्नं मुदनभिहतान् कर्तु मिह नः ।
वयं हिंसामात्रप्रकटनपरास्त्वत्प्रियतया
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

ప్రియానందస్త్వం తత్ క్షతిమపి విశంక్యైవ మనసా
ప్యకార్షీ ర్వా యత్నం ముదనభిహతాన్ కర్తు మిహ నః।
వయం హింసామాత్రప్రకటనపరాస్త్వత్ప్రియతయా
కుతో వా ధాతస్త్వం భవసి విఫల స్సర్జనగతౌ॥

## తాత్పర్యం

నీవు ఆనందము నందే ప్రీతి కలవాడవు. దాని యొక్క ఘాతాన్ని కూడా నీవు ముందుగానే అనుమానించి మేము ఆనందమునకు దూరం కాని విధంగా ఉండేలా ప్రయత్నం చేశావు. కానీ మేమేమో హింసను ప్రకటించడం మీదనే ఆసక్తిని చూపుతుంటాం, అదీ నీ ఆనందం కోసమే అని చెబుతూ. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి సరేనయ్యా! నీ వెప్పుడును నొకటే సంతసముగా
బరాబర్లొప్పన్ మాకు నది యటులే పారెడు నటుల్
మరేమీ యడ్డంకుల్ తగులనటు మెల్పన్ దగవులన్
మొరాయింపన్ దాతా! మము గనవదేమో! చెదిరితే?

# 30

त्वमप्राप्यो वाचा वयमिह सदा प्राप्यवचनाः
न कस्यापि स्तोता त्वमसि हि वयं स्तोत्रनिपुणाः ।
भवत्प्रादुर्भूता वयमिह भवद्भिन्नचरणाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

త్వమప్రాప్యో వాచా వయమిహ సదా ప్రాప్యవచనాః
న కస్యాపి స్తోతా త్వమసి హి వయం స్తోత్రనిపుణాః।
భవత్ప్రాదుర్భూతా వయమిహ భవద్భిన్నచరణాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫల స్సర్జనగతౌ॥

**తాత్పర్యం:**

నీవు మాటలతో పొందలేని వాడవు. మేమేమో పొందదగిన మాటలు కలిగినవారం. నీవు ఎవరినీ స్తుతించవు. మేమేమో స్తోత్ర విషయంలో నిపుణులం. నీ నుండి పుట్టిన మేము నీప్రవర్తనకు భిన్నమైన ప్రవర్తన కలిగి వున్నాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవుతున్నావు?

**అచ్చతెనుఁగు**

శిఖరిణి అదేనయ్యా! ఏ మాటలకు మెతకై అందవు గదా!
ఎదో మాటన్ బుట్టన్ బడెదము కటా! ఎల్లరమిటన్
సొదల్ విన్పింపంగా పొగడవెవరిన్ చూడుము మమున్
చేదల్ ముట్టంగా తాత! పొగడెదమౌనా? చెదిరితే?

# 31

सदा कार्यं हेतु र्भवति च पुनः कार्यगणने
ह्यतो भूतं भव्यं भवदपि सदाऽज्ञेयफलकम् ।
कथं वा विच्छेदे वय मिह समर्थाः क्रमगतेः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సదా కార్యం హేతు ర్భవతి చ పునః కార్యగణనే
హ్యతో భూతం భవ్యం భవదపి సదాఽజ్ఞేయఫలకమ్।
కథం వా విచ్ఛేదే వయ మిహ సమర్థాః క్రమగతే
కుతో వా ధాత స్త్వం భవసి విఫల స్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఎప్పుడూ కార్యం కూడా మరొకదానికి కారణమవుతుంది. మరలా ఆ కారణం ద్వారా మరోకార్యం. అందువల్ల భూతం, భవిష్యత్తు, వర్తమానాల పర్యంతఫలమేమిటో మాకు తెలియదు. కానీ ఆ క్రమగతిని విడగొట్టడంలో పట్టుబట్టి మేమెందుకు ఇంత నేర్పును ప్రదర్శిస్తున్నాము? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి బలేపేచీ పూచీ నిడవొక పనిన్వచ్చు మరి యే
దొ లాగింపన్ వెంటిన్ పరకలవలెందోచు వరుసన్
బళీ మొత్తంబందొక్కటియె కసవౌ పాటుపనులన్
తలన్ తోకన్ లెక్కించెదము కద తాతా! చెదిరితే?

# 32

विषं सर्पे पुष्पे मधु च नवनीतं दधिहृदि
तमो गोले विद्युच्चकितचकितत्त्वं जलधरे ।
समं ते नो भिन्नं कुत इति वयं ज्ञातु मबलाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

విషం సర్పే పుష్పే మధు చ నవనీతం దధిహృది
తమో గోళే విద్యుచ్చకితచకితత్వం జలధరే।
సమం తే నో భిన్నం కుత ఇతి వయం జ్ఞాతు మబలాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫల స్సర్జనగతౌ॥

## తాత్పర్యం

సర్పము నందు విషమును, పుష్పము నందు మకరందమును, పెరుగులోపల వెన్నను, విశ్వము నందు చీకటిని, మేఘము నందు మెరుపులను ఉంచావు. నీకు అన్నీ సమానమే, భేదము లేదు. మాకు మాత్రం వేరు వేరు. ఈ విషయాన్ని తెలుసుకోవడంలో మేము దుర్బలుల మవుతున్నాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి విసంబున్ దేనెల్ వెన్న తమి మెఱుపుల్ వేనికవిగా
గ సప్పంబున్ బూవున్ బెరుగు పుడమిన్గట్టి మొయిళుల్
వెసన్ దావుల్గా దీర్చితి వొకటిగా వేరనవుగా
తసాదియ్యా! మా చూపటుల జనదు తాతా! చెదిరితే?

# 33

समूहस्याज्ञानं प्रमद इति नः किञ्चन वचः
भवे द्वा तत्त्वं तत् कथ मिह परिज्ञानघनता ।
समूहस्य ज्ञानं शमलपदवाच्यं किमु तदा
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సమూహస్యాజ్ఞానం ప్రమద ఇతి నః కించన వచః
భవే ద్వా తత్త్వం తత్ కథ మిహ పరిజ్ఞానఘనతా।
సమూహస్య జ్ఞానం శమలపదవాచ్యం కిము తదా
కుతో వా ధాతస్త్వం భవసి విఫల స్సర్జనగతౌ॥

## తాత్పర్యం

మాలో కొందరి ఒకానొక మాట,, ఆనందం అంటే సామూహిక అజ్ఞానం అని. అభ్యుపగమ్యవాదంతో దాన్ని అంగీకరిద్దాం. అది నిజం అయితే కావొచ్చు. కానీ ఆ పరిజ్ఞానంతో వచ్చే ఘనత – ప్రయోజనం – ఏమైనా ఉందా? ఆ మేరకు సమూహ జ్ఞానం దుఃఖమందామా? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి గుమిన్ తెల్వింగోల్పోవుట తనివిగా కొందరి నుడౌ
సుమీ! పోవంగా ముందుకది సరియంచున్ వినినచో
గుమిన్ తెల్వే కాబోవునా వగపదే గొప్ప యగునో?
తమేదో వెల్గేదో తెలుపవటె తాతా! చెదిరితే?

सुमं दुत्तूरं त्वं कुसुमविषये स्पष्टमकरोः
गणाना मध्यक्षोऽपि कुसुम मिदं संस्पृहयते ।
वयं वन्दामो द्वा वपि तु कुसुमं तन्न चिनुमः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సుమం దుత్తూరం త్వం కుసుమవిషయే స్పష్టమకరోః
గణానా మధ్యక్షోఽపి కుసుమ మిదం సంస్పృహయతే।
వయం వన్దామో ద్వా వపి తు కుసుమం తన్న చినుమః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

**తాత్పర్యం**

ఉమ్మెత్త పువ్వును నువ్వు స్పష్టంగా సంపూర్ణ సుమలక్షణాలతో సృష్టించావు. గణపతికూడా ఉమ్మెత్త పువ్వును పూజలో కోరుకుంటాడు. మేము మీ ఇద్దరికీ నమస్కరిస్తుంటాము. కానీ ఆ కుసుమాన్ని మాత్రం కోసుకోవడం లేదు. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

**అచ్చతెనుఁగు**

శిఖరిణి పువేగా ఉమ్మెత్తెన నలువనెగా పుట్టెనది యే
వెవో పెక్కున్నన్ కోరునిది వెనకయ్యే చేవితినా
డు వేవేదండాలిచ్చెదము తమకున్ దుల్తుము విరిన్
తవాయేముండెన్ దీన పలుకుము తాతా! చెదిరితే?

# 35

त्वदीया दिव्याभा दिनकरनिशाकान्तगलिता
विसर्पन्ती विश्वं प्रतिकणरसोद्दीपनचणा।
वयं व्याख्याम स्त्वां गुणविरहितं कार्यरहितं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

త్వదీయా దివ్యాభా దినకరనిశాకాన్తగలితా
విసర్పన్తీ విశ్వం ప్రతికణరసోద్దీపనచణా।
వయం వ్యాఖ్యామ స్త్వాం గుణవిరహితం కార్యరహితం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

నీ యొక్క దివ్యమైన కాంతి సూర్యచంద్రుల ద్వారా జాలువారుతుంది. అది ప్రపంచమంతా వ్యాపిస్తూ ప్రతి కణాన్నీ రసోద్దీపనం చేయుటలో సామర్థ్యం కలిగినది. కానీ మేము నిన్ను గుణాలు లేని వానిగా, కార్య రహితునిగా వ్యాఖ్యానిస్తుంటాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి పగఱ్ఱేలెండల్ వెన్నెలల వెలుగుల్ పంపెదవుగా
జేగాప్రొద్దున్ జేఁబిల్లియు నిడినటుల్ సాగి దెసలన్
తగన్ నీవన్నింటన్ కలిమి నొసగన్ తాత! కనుచున్
దగాగాదే లేవేపని మెఱుగులంటన్ చెదిరితే?

# 36

अकामः कामेनाहतनिजमनाः ब्रह्मरमणः
समस्तानन्दाना मपि भवति भोक्तेति ऋषिवाक् ।
परं मुक्त्यासक्ता वयमुपहताः कामकलिलैः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అకామః కామేనాహతనిజమనాః బ్రహ్మరమణః
సమస్తానందానా మపి భవతి భోక్తేతి ఋషివాక్।
పరం ముక్త్యాసక్తా వయముపహతాః కామకలిలైః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

కామరహితుడై, కామము చేత కొట్టబడని మనస్తత్వం కలవాడై, సమస్త ఆనందములకూ భోక్తకాగలడనీ, బ్రహ్మానందాన్ని పొందగలడనీ ఋషిప్రోక్తం. కానీ మేము ముక్తి కాముకులమై కామం అనే గండ్రగొడ్డలిచే కొట్టబడుతున్నాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి అఱుల్ గోర్కుల్ వానందగులని ఎడందై మనినచో
సరేమిన్ రవ్వంతైనను మిగులకే సంతసమగున్
బరిన్నిల్చున్ గా బమ్మకదియని చెప్పం తబిసులున్
తరిన్నే గోరంగా విడుపు చెడనే? తాత! చెదురా?

## 37

त्वयि प्रेमाऽपाय्यं परिमितमिवाक्रान्तसकलं
स्वयं बह्वीभावे त्रिभुवनजगत्कार्यकरणे ।
वयं द्विष्मो विश्वं सततमपि मिथ्याप्रकथनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

త్వయి ప్రేమాపాయ్యం పరిమితమివాక్రాన్తసకలం
స్వయం బహ్వీభావే త్రిభువనజగత్కార్యకరణే।
వయం ద్విష్మో విశ్వం సతతమపి మిథ్యాప్రకథనాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

నీవు స్వయంగా చాలాగా (బహు ప్రజాయేయ) మారుతూ, చలన శీలమైన ఈ జగత్కార్యాన్ని చేయటంలో అంతులేని ప్రేమ, చక్కగా కొలిచి తీర్చినట్టు కనిపింపజేసే నైపుణ్యం చూపావు. కానీ మేము మాత్రం ఎప్పుడూ దీనిని మిథ్య అని (కల్లబొల్లిమాటలు) చెబుతూ ప్రపంచాన్ని ద్వేషిస్తున్నాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి మగండై నీవేగా ఒకటి పదిగా మాటికగుచున్
మొగిన్ ముక్కారుల్ మేల్ నెనరున నదే మొత్తమనగా
జిగింజూపింపన్ కల్ల యనెదము వాసిం గనుటకై
తగున్నీకే యీ వంకరపనులు తాతా! చెదిరితే?

# 38

मरन्दं सौरभ्यं द्वयमपि सुमे स्थापितवता
त्वया यद्दृष्टं तत् न हि न हि वयं द्रष्टुमनसः ।
मरन्दे गन्धे वा भवति सततं भावन महो
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

మరందం సౌరభ్యం ద్వయమపి సుమే స్థాపితవతా
త్వయా యద్దృష్టం తత్ న హి న హి వయం ద్రష్టుమనసః।
మరందే గంధే వా భవతి సతతం భావన మహో
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఏ దర్శనంతో నువ్వు పుష్పంలో మకరందాన్ని, పరిమళాన్ని కూడా ఏర్పాటు చేసావో, దానిని ఆ విధంగా చూడాలనే మనసు మాకు లేదు. మేము మాత్రం మకరందం మీద కానీ, సుగంధం మీద కానీ ఏదో ఒక దాని మీదే దృష్టి పెడతాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి విరిన్ తావిన్ తేనెన్ కలిపితివి నీవే సొగసుగా
మరే మేలున్నీవెంచితివొ కనమా మాదిరి మదిన్
నెటిన్ తావే రంజౌనను నొకడు తేనెన్ మరొకడున్
తరాలెన్నెన్నో మారెడి నిటులె తాతా! చెదిరితే?

## 39

अशक्तास्सम्भ्रान्ता भवभवसमस्तक्लेशकटुकाः
वदन्तो मिथ्यात्वं भवदधिकृतस्यास्य जगतः ।
वृथा जीवामस्त्वं कथमिव सहेथा लघुमतीन्
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అశక్తాస్సమ్భ్రాన్తా భవభవసమస్తక్లేశకటుకాః
వదన్తో మిథ్యాత్వం భవదధికృతస్యాస్య జగతః।
వృథా జీవామస్త్వం కథమివ సహేథా లఘుమతీన్
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

మేము అశక్తులం. అయోమయంగా ఉంటాం. సంసారంలో పుట్టిన రకరకాల బాధలు భరించలేనివారమై నీ స్వరూపమై వుండే ఈ జగతిని మిథ్య అనీ, అది వ్యర్థమని చెబుతున్నాము. ఈ అల్పబుద్ధులను నువ్వెలా సహిస్తున్నావు? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి మముంజూడన్ నిస్సత్తువయు మెదడో మట్టిపలకొ
నెమో వెంటాడున్ పుట్టుకల వెతలెన్నేన్ బ్రతుకులన్
తమాయింపన్ లేకెప్పుడు నలువచేతల్ నిలువ విం
త మిద్దెల్ కుప్పల్ కూలుననెదము తాతా! చెదిరితే?

## 40

यदा याथातथ्यं मनसि विहर च्छान्तिसुखदं
कुतो द्वंद्वप्रीति स्तदनुगुणजा भीति रथवा ।
वयं यस्मिन् कस्मिन् निहितमतयो भ्रष्टगतयः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

యదా యాథాతథ్యం మనసి విహర చ్ఛాన్తిసుఖదం
కుతో ద్వంద్వప్రీతి స్తదనుగుణజా భీతి రథవా।
వయం యస్మిన్ కస్మిన్ నిహితమతయో భ్రష్టగతయః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

వాస్తవికతనే మనసులో నిలుపుకుంటే అది శాంతిని, సుఖాన్ని ఇస్తుంది. కానీ, ఎందుకోగానీ ద్వంద్వభావనపై ప్రీతి, దాని వలన పుట్టిన భయం (మమ్ములను శాసిస్తాయి). మేము ఏదో ఒక దానిలో బుద్ధిని ఉంచి గతిని కోల్పోతున్నాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి మదిన్నిల్పంగా నున్నదెదొ యటులే మంచి జరుగున్
సొదల్ చేరంబోవేవియును కుదురొ చొక్కు కలుగుం
గదా! మాకెల్లన్ రెండయి వెఱతు మొక్కంట వలపౌ
నిదేమయ్యా! తాతా! యొనరిచితి వీవే చెదిరితే?

# 41

समस्तं विश्वस्मिन् प्रभवमृतिम न्नाशमहितं
स्वरूपस्यान्यस्य ग्रहणपरमेवास्ति समये ।
तथा प्रत्नस्याप्तौ वय मिह यथास्वेष्टकथनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సమస్తం విశ్వస్మిన్ ప్రభవమృతిమ న్నాశమహితం
స్వరూపస్యాన్యస్య గ్రహణపరమేవాస్తి సమయే।
తథా ప్రత్నస్యాప్తౌ వయ మిహ యథాస్వేష్టకథనాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఈ విశ్వంలో జరామరణాలు కలదంతా నశించేదే! (నాశ మంటే అప్పటి రూపంతో కనిపించకుండా పోవడమే) ఆ నాశము సమస్తమూ మరొక స్వరూపము మీద ఆసక్తి మాత్రమే. తగిన వేళలో రూపాంతరాన్ని పొందుటయే. మేము మాత్రం నూత్నరూప విషయంలో మా ఇష్టం వచ్చినట్టు చెపుతుంటాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి విడంబోవే చావుంబుటుక లెపుడున్ వెంబడి పడున్
చెడంగానే యేదైన మరొక మెయిన్ చెందవలదే?
కడున్ సొంతంబైనట్లనుట తగునా? కద్దా? చనునో?
తడంబాటా? మాకీ తెలివి నిడుట తాతా! చెదిరితే?

**42**

परो नित्यो हेतु र्जगदिद मतो जातविभवं
कुतोऽनित्यं याव द्विलसति तदीयत्वगणना ।
अदृश्यं वाऽनित्यं प्रकटितविरूपत्व मथवा
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

పరో నిత్యో హేతు ర్జగదిద మతో జాతవిభవం
కుతోఽనిత్యం యావ ద్విలసతి తదీయత్వగణనా।
అదృశ్యం వాఽనిత్యం ప్రకటితవిరూపత్వ మథవా
కుతో వా ధాతస్త్వం భవతి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

పరమాత్మ నిత్యుడూ, కారణం కూడా. ఈ జగతి అంతా ఆయన నుండే పుట్టుక లేదా ఆయనయే అనే వైభవం కలిగినది. ఇది ఆయనది అనే పరిగణన వున్నంతకాలం ఇక అనిత్యత ఎక్కడిది? కాకపోతే రూపాంతరత్వం పొందడం అనేదే ఉంది. అది అదృశ్యమానతయా? లేక అనిత్యతయా? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఇదెల్లన్ తానేయై చెడకెపుడు నిందే యెసఁగుచో
నెదేనిన్ రూపుంబొందుటయు తననుండే యయినచో
ముదింబోనైనన్ మార్పు గనుటగు నెప్డుం జనదుగా
గుదింగ్రుచ్చేన్ తాతా! నిలువమి యెదీ? కోల్పడితివో?

# 43

घटोऽ नित्यः स्याद्वा न हि भवति किं मूलमृदिनी
भवेद्यावद्रूपं घट इति तथा तत्कृतिफलम् ।
कथं तन्मिथ्यात्वं परिचितफलत्याग कलुषं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

ఘటోఽ నిత్యః స్యా ద్వా న హి భవతి కిం మూలమృదినీ
భవేద్యావద్రూపం ఘట ఇతి తథా తత్కృతిఫలమ్।
కథం తన్మిథ్యాత్వం పరిచితఫలత్యాగ కలుషం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఘటం అనిత్యమైతే కావచ్చు, కానీ దానికి మూలమైన మట్టి ఉండనే వుందికదా.. ఘటమనే రూపం, దాని ఫలితం వున్నంత కాలం అది మిథ్య ఎలా అవుతుంది? మనకు పరిచితమైన ఫలితాన్ని కాదనడం ద్వారా జ్ఞానం కలుషితమైపోతోంది కదా. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఎపుండో బ్రద్దల్ మంటి కడవగు మన్నేమి చనదే
ఇపుండా రూపున్ దాని పనితనమెంతే నిలుకడౌ
నపుండెట్లౌ తాన్ కల్ల అటులన నౌనా? తెలివియా?
తపాలా బంట్రౌతై యొసగెదవె? తాతా! చదువవా?

# 44

अनादिं त्वा मुक्त्वा जगदिद मनादीति कथयन्
स्वयं चानादिस्सन् सुविदितजगज्जालविभवः ।
कुतो वा कस्मा द्वा कथमिह जनो मुक्ति परमः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అనాదిం త్వా ముక్త్వా జగదిద మనాదీతి కథయన్
స్వయం చానాదిస్సన్ సువిదితజగజ్జాలవిభవః।
కుతో వా కస్మా ద్వా కథమిహ జనో ముక్తి పరమః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

నిన్ను అనాది అని చెబుతున్నాము. ఈ జగత్తు అనాది అంటున్నాము. మేమూ అనాదియని చెప్పుకొంటున్నాము., ఈ జగత్తు యొక్క విభవాన్ని చక్కగా తెలుసుకొని కూడా, (అనాదిత్వం చేత అనన్తత్వమూ సంభావ్యమే) ఇక ముక్తి దేని నుండి? ఎందుకు? పోనీ అది ఎలా? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి మొదల్ నీకున్నీ చేతలకు నటులేమున్ గనమనన్
తుదే తానుండంబోదుగద పరికింతున్ విడుదలన్
మదింగోరంగోరన్ జనుట యెటకో మాదిరెటులో
ఎదిన్ తాతా! రేకట్టదు తెలుపు మీవే చెదిరితో?

# 45

गुणातीतो वा स्याः निरुपमगुणाकीर्णविभवं
जगद्युष्मद्रूपं नवरसमखं सौरभयुतम् ।
रसाभावोत्सन्ना दिनदिनविरक्ता वयमिह
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

గుణాతీతో వా స్యాః నిరుపమగుణాకీర్ణవిభవం
జగద్యుష్మద్రూపం నవరసమఖం సౌరభయుతమ్।
రసాభావోత్సన్నా దినదినవిరక్తా వయమిహ
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

నీవు గుణాతీతుడవైతే కావొచ్చు. నీ రూపమైన ఈ జగత్తు మాత్రం అసాధారణ గుణ వైభవాలతో వ్యాపించినట్టిది, నవరసభరితయాగ మిది, సుగంధం కలిగినట్టిది. కానీ, మేము మాత్రం రసాభావదృష్టితో పాడైపోతూ, రోజురోజుకూ విరక్తులమౌతున్నాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి గొనంబుల్ గుర్తుల్ లేనియటులుగ నీకుం కుదిరినన్
మనంబుల్ పల్ తీరుల్ పలు తడుల జేన్నంబగును మా
కునెన్నో మేల్ తావుల్ చెలగు నవి పోగొట్టుకొనుచున్
కునారిల్లన్ తాతా! అది విడుపొ? నీకుం చెదరెనే?

## 46

अनादिः कालोऽयं निखिलजगदाधारगतिक
स्तथानन्त श्शश्वच्चलनकलन स्साक्षिगमनः ।
वयं त्वल्पायुष्का पर मिह जगद्भ्रान्तिकथनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అనాదిః కాలోఽయం నిఖిలజగదాధారగతిక
స్తథానన్త శ్శశ్వచ్చలనకలన స్సాక్షిగమనః।
వయం త్వల్పాయుష్కా పర మిహ జగద్భ్రాన్తికథనాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

ఈ కాలం అనాది. సమస్త జగత్తుకు ఆధారమైన గమనం కలది. అలాగే అనంతం కూడా. ఎప్పుడూ చలనమే చిహ్నంగా కలది. సాక్షీభూతమైన గమనం కలది. కానీ, అల్పాయుష్కులమైన మేము మాత్రం ఇక్కడ ఈ జగత్తు అంతా భ్రాంతి అని చెబుతున్నాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి మొదల్ లేనేలేదే తటికి నడుచున్ మొత్తమునకై
తుదిం గానంబోమే కదలు నెపుడున్ తోడఁగనుచున్
పదేళ్లన్ [1]చిట్టన్ చచ్చెదము బమగా వాకొనెద మిం
దెదౌ నిక్కంబో తాత! తెలుపవుగాదే చెదరితే?

1. చిట్ట = చిటికె

# 47

पृथक्त्वं द्र्व्याणां त्रिभुवनगतानां विरचयन्
कृतं वैविध्यं ते मनसि बहुधा चिन्तितमपि ।
सदा वैरुध्यं नः स्फुरति हृदयेष्वद्भुत मिदं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

పృథక్త్వం ద్రవ్యాణాం త్రిభువనగతానాం విరచయన్
కృతం వైవిధ్యం తే మనసి బహుధా చిన్తితమపి।
సదా వైరుధ్యం నః స్ఫురతి హృదయేష్వద్భుత మిదం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

త్రిభువనాలలో వుండే ద్రవ్యాల కన్నిటికీ పృథక్త్వానికై విశేషాలను సృష్టించి నువ్వు వైవిధ్యాన్ని చూపించావు. కానీ ఎంత ఆలోచించినా ఇది మా హృదయాలలో మాత్రం వైరుధ్యంగానే కనిపిస్తుంటుంది. ఇది విచిత్రం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి తగన్ మూడంతస్తుల్ సరకు విడిచేతన్ సలుపగా
ఎగండిగ్గన్ చూడన్ విడివిడిగ నీ వే మెదదలన్
పగల్ గా వేరై యుండెదము వినఁ చెప్పంగ నిది విం
తగున్ మే మిట్లుండంగ నరయవె తాతా! చెదిరితే?

# 48

निजोहामात्रास्तिं वदसि परमं शाश्वत मत
स्समुत्पन्नं दृश्यं मनसि च भवन्तं क्षर मिति ।
कथं वाऽनित्यत्वं नयनहृदयज्ञातफलिनः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

నిజోహామాత్రాస్తిం వదసి పరమం శాశ్వత మత
స్సముత్పన్నం దృశ్యం మనసి చ భవన్తం క్షర మితి।
కథం వాఽనిత్యత్వం నయనహృదయజ్ఞాతఫలినః
కుతో వా ధాతస్త్వం భవసి విఫల స్సర్జనగతౌ॥

## తాత్పర్యం

పరమాత్మకు మన ఊహల చేత మాత్రమే ఉనికి (మనోమాత్రవృత్తి). ఆయన్నేమో శాశ్వతుడు అంటున్నాము. ఆయన నుండి పుట్టి, దృశ్యమూ, మనోవృత్తి కూడా అయినదాన్ని అశాశ్వతం అంటున్నాం. నయనంతోనూ, హృదయం చేతనూ జ్ఞాతమైన ఫలం కలది అనిత్యం కావడమేమిటి? మనోమాత్రవృత్తి నిత్యం కావడ మేమిటి? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఎదో రూపై నిల్వన్ తలపున నతండే తిరమొ? క
న్నుదోయిన్ కన్పట్టన్ మది గలిగియున్ పోవునొ? బళీ!
ఎదన్ కంటన్ చూపట్టునది చను గానీ తలపు పొం
దదా? తానే కన్పట్టమి నెటుల తాతా! చెదరెనే?

# 49

सुषुप्तौ स्वप्ने वा भवति मनुजे नास्ति जगतः
क्षति र्वाऽदृश्यत्वं परमपरलोकस्य जननम् ।
तमोव्याप्ते खे किं दिनकरनिशाभर्तृविलयः?
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సుషుప్తౌ స్వప్నే వా భవతి మనుజే నాస్తి జగతః
క్షతి ర్వాఽదృశ్యత్వం పరమపరలోకస్య జననమ్।
తమోవ్యాప్తే ఖే కిం దినకరనిశాభర్తృవిలయః?
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

మనుజుడు గాఢనిద్రలో ఉన్నా, స్వప్నంలో ఉన్నా జగత్తుకు నాశమూ లేదు, అదృశ్యత్వమూ లేదు. పైపెచ్చు మరో క్రొత్త లోకం జనిస్తోంది కూడా. ఆకాశం చీకటిచే కమ్మివుంటే సూర్యుడు, చంద్రుడు లేనట్టేనా? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి కనుల్ మొద్దో లోనిద్దురను కలలన్ గాని చెడకే
కనన్రాముల్ లేకుండును పయి నగుంగా కలనెదో
కొనన్ చీకట్లా ప్రొద్దు నెలల నటే కోల్పడముగా
తనంతన్ తానే ఇట్లనుకొనునొ? తాతా! చెదరితో?

# 50

अहं त्वं दूरस्थो निकटतरवर्तीति बहुधा
व्यवाहारः कार्यो जगति मनुजै र्भिन्नतनुभिः ।
तनूनाशे नश्यत्यहमपि यथाजात मकृतः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అహం త్వం దూరస్థో నికటతరవర్తీతి బహుధా
వ్యవాహారః కార్యో జగతి మనుజై ర్భిన్నతనుభిః।
తనూనాశే నశ్యత్యహమపి యథాజాత మకృతః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

వేరు వేరు శరీరాలున్న మనుష్యులమైన మేము వ్యవహారం కోసం నేను నువ్వు, దూరం వాడు(వాడు), దగ్గరి వాడు (వీడు) అంటున్నాం. ఈ శరీరం నశించినప్పుడు శరీరంతో పుట్టిన అహం కూడా యథాగతంగా నశించిపోతుంది (మేము అహం వదలాలి అని తీవ్రప్రయత్నాలు చేస్తుంటాం). విధాతా! ఇలా సృష్టిగతిని కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి మెయిన్ నేనున్ నీవంచు నతడనుచున్ మేము విడిగా
నె యేనాడైనన్ వేరుగ పలుకుచున్ నేన్ వదలమా
పయిన్ పోగా మేనేనును నదియె పోవన్ సరియగున్
గయాళై తాతా! కేకలిడ నగునే? కాస్త చెదరితే

# 51

प्रमोदाविष्कारं जगदिद मत स्स्वर्गकुतुकं
परानन्दावाप्ति स्तदनु च फलं दर्शितमपि ।
असंतृप्तास्तैस्तै र्वयमिह विरक्त्यैकगमनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

ప్రమోదావిష్కారం జగదిద మత స్స్వర్గకుతుకం
పరానన్దావాప్తి స్తదను చ ఫలం దర్శితమపి।
అసంతృప్తాస్తైస్తై ర్వయమిహ విరక్త్యైకగమనాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఈ జగత్తు అంతా ఆనందాన్ని ఆవిష్కరించేదే. తర్వాత స్వర్గంపై ఆసక్తి. ఆ పై పరానందం. ఇలా ఎన్ని ఫలాలను చూపించినా, ఎన్ని చెప్పినా కూడా మేమిక్కడ అసంతృప్తులమై విరక్తి వైపు మాటాడుతుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఎటన్ నేలన్ కన్గొన్న నొసగును తానెల్ల తనివే
అటన్ పైకేగన్ వేల్పులపుడమికై ఆరట మెదన్
పటాపంచల్గా నాపయి పెనురహిన్ పల్కినను మే
మిటన్ తాతా! బైరాగినుడు లన వింటే? చెదరితే?

# 52

विनष्टायां व्यक्तौ तदनुगतजाते र्विलसने
सति ज्ञानोत्पत्तिः कथ मितरथान्यस्य गणना ।
वयं सामान्यस्याप्यनुपद मनित्यत्वकथनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

వినష్టాయాం వ్యక్తౌ తదనుగతజాతే ర్విలసనే
సతి జ్ఞానోత్పత్తిః కథ మితరథాన్యస్య గణనా।
వయం సామాన్యస్యాప్యనుపద మనిత్యత్వకథనాః
కుతో వా ధాత స్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

వ్యక్తి నశించిపోయినా వాని యొక్క జాతికి సంబంధించిన జ్ఞానం వున్నప్పుడే వ్యక్త్యంతర జ్ఞానసిద్ధి. (తదవభావజ్ఞాన మైనా అంతే). అలా కాకపోతే వేరొకదాని పరిగణనమే ఎలా? కానీ మేము మాత్రం సామాన్యాన్ని కూడా అనిత్యం అంటున్నాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి మెయిన్ కోల్పడ్డన్ వానిగురుతులు నెమ్మిన్ తగులుచో
పయిన్ వేరొండౌ తెల్వి యనదగు నిల్వల్ మిగులవే
పొయిన్ కాలన్ కట్టెన్ మరొకటిడ నిప్పున్ విడిగ నౌ
నె? యిందేదో తాతా! మెలిక నిడినావే చెదరితే?

# 53

सदा जीवस्यास्ति प्रचुर मिह देहान्तरगतिः
जडस्याप्यस्तित्वं ध्रुव मपररूपप्रभवतः ।
जगन्मिथ्याभावः कथ मिति मनोजात मिह नः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సదా జీవస్యాస్తి ప్రచుర మిహ దేహాన్తరగతిః
జడస్యాప్యస్తిత్వం ధ్రువ మపరరూపప్రభవతః।
జగన్మిథ్యాభావః కథ మితి మనోజాత మిహ నః
కుతో వా ధాత స్త్వం భవసి విఫల స్సర్జనగతౌ॥

## తాత్పర్యం

జీవుడికి దేహాంతర ప్రాప్తిని స్పష్టంగా చెబుతున్నాం. జడాలకు కూడా రూపాంతర స్వీకారం అనేది ధ్రువం. కానీ ఇక్కడ మాకు ఈ జగత్తు మిథ్య అనే భావం వస్తోంది. ఎలా? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి మెకాలున్ పుర్వుల్ మానిసు లుసురుకల్మిన్ మరిమరిన్
పొకాలన్ మైదాల్తుర్ కదలనివి మార్పున్ కొనునెదో
ఇకేమైనన్ కన్పట్టనిది కలదే? ఏవి బుడగల్?
వకావక్కల్ తాతా! పనులు పలుకుల్ లావు చెడెనే?

# 54

अवश्यम्भाव्यं नः सहचरजनै र्जीवन मतो
भवत्येवान्तर्यं प्रतिपदमतो भीतमनसः ।
समन्वेतुं ज्ञातुं विरतकृतयो धावनरताः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అవశ్యమ్భావ్యం నః సహచరజనై ర్జీవన మతో
భవత్యేవాన్తర్యం ప్రతిపద మతో భీతమనసః।
సమన్వేతుం జ్ఞాతుం విరతకృతయో ధావనరతాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

మాకు సహచర జనులతో కలసి జీవించడం అనేది అనివార్యం. దాని వలన తేడాలు వస్తూ ఉంటాయి. ప్రతి క్షణం, ప్రతి అడుగులోనూ ఆంతర్యం ఉంటుంది. మేము దానిని సమన్వయించుకోడానికి భయపడుతూ ప్రయత్నం చేయకుండా పారిపోతూ ఉంటాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఎటున్ తప్పింపన్ లేము కలివిడి వేరే మనుటెటౌ
నటౌటన్ తేడాల్ పెక్కడుగడుగునందాగవవియున్
కటారిన్ త్రుంపంజాలమొదుగుటకుంగాక వెఱపై
తటాయింపంగామిన్ పఱచెదము తాతా! చెదరితే?

# 55

पृथक्त्वं वैशिष्ट्यं य दिह सहजं जीवनगता
वभिन्नत्वालोको निरुपमजगद् ज्ञान गरिमा ।
तदेवाचार्याणां वचनमपि नः किन्त्वगणितं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

పృథక్త్వం వైశిష్ట్యం య దిహ సహజం జీవనగతా
వభిన్నత్వాలోకో నిరుపమజగద్ జ్ఞాన గరిమా।
తదేవాచార్యాణాం వచనమపి నః కిన్త్వగణితం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

జీవులకు పృథక్త్వం, వైశిష్ట్యం అనేవి సహజధర్మాలు. అయితే వాటిపై అభేదదర్శనం కలగటం నిరుపమానమైన ఈ జగత్తును గూర్చి చక్కగా తెలిసికొనటం. ఆచార్యుల వచనం కూడా అదే. కానీ మేము దానిని పట్టించుకోవడం లేదు. విధాతా! సృష్టి గతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఒకేతల్లైనన్ బిడ్డలొకటిగ తాముందురె? సరే
ఒకే పోల్కిన్ వారున్నను నడత లెట్లొక్కటి యగున్
[1]చొకాటంబౌ మేల్ చూపున నొకటిగా చూడుడన చెం
తకున్ రానీమా పెద్దల నుడిని తాతా! చెదరితే?!

1. స్వచ్ఛము

## 56

जगत्साक्षी साक्षात्करणपदवी मेत्य सततं
व्रजत्युच्चै र्नीचैरपि वियति सर्वस्य जगतः ।
कथं मिथ्याभ्रान्तिः कुत इह जनक्रान्तिहननं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

జగత్సాక్షీ సాక్షాత్కరణపదవీ మేత్య సతతం
వ్రజత్యుచ్చై ర్నీచైరపి వియతి సర్వస్య జగతః।
కథం మిథ్యాభ్రాన్తిః కుత ఇహ జనక్రాన్తిహననం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

జగత్సాక్షి అయిన సూర్యుడు కంటికి కనిపిస్తూ నిరంతరాయంగా ఉచ్చైర్గతితోనూ, నీచైర్గమనంతోనూ సంచరిస్తున్నంత కాలం ఈ ప్రపంచ మంతా మిథ్య అనే భ్రాంతి ఎందుకు? దాని ద్వారా మానవాభివృద్ధి హనన మెందుకు? విధాతా! ఇలా సృష్టిని కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి కనున్ నింగిన్ తాన్ సాకిరిగ నెపుడున్ కంటితెలపై
చనున్ పైపైకిన్ క్రిందికి దిగుచునిచ్చల్ తిరుగుచో
అనంగా నెట్లొ ప్రొద్దుఁగనుచు తిరంబా? యిది యటం
చు నిల్పన్ పెంపున్ తాత! తగునటె? ఇస్సో! చెదరితే?

# 57

विमुक्तैस्सर्वेभ्यः पुनरपि सदाधारगमने
विमुक्तिर्भ्रान्तिः स्या दविदितगुरूरूत्तममतिः ।
यदद्वैता दृष्टिस्तदु खलु भवेन्मोक्षपदवी
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

విముక్తైస్సర్వేభ్యః పునరపి సదాధారగమనే
విముక్తిర్భ్రాన్తిః స్యా దవిదితగురూరూత్తమమతిః।
యదద్వైతా దృష్టి స్తదు ఖలు భవేన్మోక్షపదవీ
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

అన్నిటిని వదిలించుకొని కూడా మరలా ఇంకో ఆధారం (మోక్షం) కోసం వెతుకుతున్నాం అంటే విముక్తి అనేది ఒక భ్రాంతి. గురుభావం సరిగా అర్థం చేసుకోలేని స్థితిలో వున్నాం. ఏదైతే అద్వైత దృష్టియో అదే మోక్షమై ఉండాలి (అద్వైత దర్శనం మోక్ష:) కానీ మరో ఆధారం కాదు. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఎదిన్ వద్దంచున్ త్రెంచితి ననుచు నద్దేదొ దొరుకన్
మదిన్ దానందేనిల్పి విడుపునకై మల్లడి గనం
గ దానిన్ వేరొండందురొ? ఒకడనంగా తగినదో?
కదా తాతయ్యా! ఒజ్జతలపెరుగంగా చెదరితే?

## 58

कथं वाऽ विद्येयं य दिह जगतः पूजनमति
र्विभाव्यैतत्सर्वं परमरमणीयात्मविभवम् ।
क्व वाऽद्वैतज्ञानप्रकटविनियोगोस्त्यपरथा
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

కథం వాఽ విద్యేయం య దిహ జగతః పూజనమతి
ర్విభావ్యైతత్సర్వం పరమరమణీయాత్మవిభవమ్।
క్వ వాఽద్వైతజ్ఞానప్రకటవినియోగోస్త్యపరథా
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

పరమ రమణీయమైన ఆత్మవైభవంగా జగత్తును భావించినప్పుడు దానిని పూజించాలనే సంకల్పం అవిద్య ఎలా అవుతుంది? జగత్తు ఆత్మవైభవం కాకపోతే అద్వైతమనే జ్ఞానానికి స్పష్టమైనవినియోగ స్థాన మేముంది? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి ఇదంతా నీచేతే అయినపుడు మెప్పేల దొసగా?
మదిన్ దోచుంగాదే సొగసులివి కొంపల్ మునుగునే?
ఎదిన్ రెండంచున్ లేదనినయపుడట్లే కనుటలో
ఎదేనిన్ తాతా! తప్పా? కన నెలవేదీ? చెదరితో?

# 59

सुविज्ञाताद्यन्ते जगति धिषणा स्या दस दिति
कथं वाऽविज्ञाते प्यस दिति मति र्हेतुरहिता ।
अजानन्तोऽप्यादिं वयमिह जगद्भ्रान्तिकथनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సువిజ్ఞాతాద్యన్తే జగతి ధిషణా స్యా దస దితి
కథం వాఽవిజ్ఞాతే ప్యస దితి మతి ర్హేతురహితా।
అజానన్తోఽప్యాదిం వయమిహ జగద్భ్రాన్తికథనాః
కుతో వా ధాత స్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

లోకంలో ఆద్యంతములు తెలిసినదానిని అసత్తు అని చెప్పవచ్చు. తెలియకపోతే దాని గూర్చి చెప్పడం ఎలా కుదురుతుంది.? అది హేతురహితం కాదా? కానీ మేమిక్కడ ఆద్యంతాలు తెలియకుండానే ఈ జగత్తు భ్రాంతి అని చెబుతుంటాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలు డవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి మొదల్ చూడంబోమెవ్వరము తుది ఏమో ఎఱుగమే
అదేదో చెప్పంగల్గినయపుడెకాదా? నిలువదన్
గదాయింపుల్ వాక్రుచ్చుట లెఱుగకే కాదిది తిరం
బిదే దారన్నన్ తాత! బిగువులేదే! చెదరితే?

# 60

अविद्य स्तत्त्वज्ञ श्च समकरणौ तुल्यभरणौ
समानाविर्भा वा वविदितमृती काऽस्ति विभिदा।
विनीयोगे भेदो चित इह भवेत् किन्तु न तथा
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అవిద్య స్తత్త్వజ్ఞ శ్చ సమకరణౌ తుల్యభరణౌ
సమానావిర్భా వా వవిదితమృతీ కాఽస్తి విభిదా।
వినీయోగే భేదో చిత ఇహ భవేత్ కిన్తు న తథా
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

అవిద్యుడు, విద్వాంసుడు ఇద్దరూ సమాన కరణములు, సమానమైన బాధ్యత కలిగినవారే. ఇద్దరూ కూడా సమానమైన పుట్టుక కలవారే, మరణాన్ని గూర్చి తెలియని వారే. ఇక వీరిద్దరికీ భేదం ఏముంది? ఈ లోకంలో జ్ఞానవినియోగంలో భేదం కనిపించాలి. కానీ అది మాత్రం కనిపించట్లేదు. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి అదేదో మొత్తంబబ్బినతడెఱుకే అందనతడున్
పొదిన్ కూర్చున్నాయమ్ము లొకటెయగుంబో పని యెదో
అదే పుట్టొ చేవుందెలియ దెది [1]వారాయిరువురం
దుఁదెల్విన్ తాతా! వాడుటను సరియందో? చెదరితో?

1. వార=భేదము

# 61

न वादा दद्वैता द्भवति जनुषो मोक्षपदवी
विना तद्विज्ञाना त्प्रियतदनुभवा त्तस्य फलनात् ।
वयं वाक्यै र्वादै र्मधुघृतरसं ज्ञातुमनसः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

న వాదా దద్వైతా ద్భవతి జనుషో మోక్షపదవీ
వినా తద్విజ్ఞానా త్ప్రియతదనుభవా త్తస్య ఫలనాత్।
వయం వాక్యై ర్వాదై ర్మధుఘృతరసం జ్ఞాతుమనసః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

అద్వైత జ్ఞానం లేకుండా, తనకిష్టమైన ఆ ఆనందానుభవం లేకుండా, దాని ఫలం కనిపించకుండా, అద్వైత వాదం వలన జనులకు మోక్షం రాదు. కానీ, మేమేమో వాక్యాలతో, వాదాలతో తేనె, నెయ్యి మొదలైన వాటి రసాన్ని తెలుసుకొనే ప్రయత్నం చేస్తుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఒకండేకానీ రెండు కలుగవటంచూరక ననన్
బుకాయింపౌ తెల్విన్ తనివిగనుటన్ పొందిక వలెన్
సుకంబొప్పన్ సుద్దుల్ తగవు లవియే చూపుటకు తే
నెకున్ తాతయ్యా! నేతి కదియే తెఱగౌనే? చెదరితే?

**62**

तिरस्कुर्मो नो त्वां त्वदभिलषितं नापि विपुलां
त्वदात्मीयाम् सृष्टिं पर मिह वयं वच्म नितराम् ।
परात्मानं नित्यं जगदिद मनित्यं भ्रम मथो
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

తిరస్కుర్మో నో త్వాం త్వదభిలషితం నాపి విపులాం
త్వదాత్మీయాం సృష్టిం పర మిహ వయం వచ్మ నితరామ్।
పరాత్మానం నిత్యం జగదిద మనిత్యం భ్రమ మథో
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

నిన్ను తిరస్కరించట్లేదు, నీ కోరికనూ తిరస్కరించట్లేదు, నీ స్వరూపమైన ఈ సృష్టినీ తిరస్కరించట్లేదు. కానీ, మేము ఆ పరమాత్మ నిత్యమని, జగత్తు అనిత్యమని లేదా భ్రాంతియని చెబుతుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి సరే నిన్నున్ నీచేతను తలపునున్ చేక్కననుచున్
మరిన్ మెప్పుల్ కుప్పల్ పలికెదము నైనన్ తిరమదే
బరాబర్లౌ వెల్గొక్కడె ఇది చనున్ పాయు ననుచున్
తరాలెన్నైనన్ పల్కెదము కద! తాతా! చెదరితే?

## 63

पराद्भिन्नो जीवो जडमपि च जीवा ज्जडमपि
तथा जीवाज्जीवो जडमपि जडाद् भिन्न मथवा ।
समस्तेप्यद्वैता दृगिह तु भवेन्मोक्षसरणिः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

పరాద్భిన్నో జీవో జడమపి చ జీవా జ్జడమపి
తథా జీవాజ్జీవో జడమపి జడాద్ భిన్న మథవా।
సమస్తేప్యద్వైతా దృగిహ తు భవేన్మోక్షసరణిః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

పరుడి కంటే జీవుడు, జడమూ భిన్నాలే. జీవుడి కంటే జడం భిన్నం. జీవుడికంటే జీవుడు, జడం కంటే జడం భిన్నాలు. కానీ భిన్నములైన ఈ సమస్తములయందు (పరుడు, జీవుడు, జడము) అద్వైత దర్శనమే మోక్షం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి అతండే పల్ మేనుల్ విడివిడిగ పెక్కొ ఉసురులై
అతండే తానెన్నో కదలనివి మొద్దొ తునుకలై
అతండా మేనుల్ మొద్దులు పెఱలుగానై మెలగినన్
కుతిన్ తాతా! మూడొక్కడన విడుపగున్బో! చెదరితే?

# 64

परस्याप्यस्तित्वे प्रबलतरमानं जगदिदं
तदीयै र्दिव्यांशैः प्रकटित विशेषै र्गुणनुतैः ।
ततो यावत्तस्य स्थिति रिह परस्य स्थितिरपि
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

పరస్యాప్యస్తిత్వే ప్రబలతరమానం జగదిదం
తదీయై ర్దివ్యాంశైః ప్రకటితవిశేషై ర్గుణనుతైః।
తతో యావత్తస్య స్థితి రిహ పరస్య స్థితిరపి
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ప్రకటింపబడిన గుణనుతములైన దివ్యాంశాలతో కూడిన ఈ జగత్తే పరుడి యొక్క అస్తిత్వానికి కూడా ప్రబలతర ప్రమాణం. కాబట్టి ఈ జగత్తు ఎంత కాలముంటుందో ఆ పరుడి స్థితి కూడా అంతకాలం ఉంటుంది. (మేము ఈ జగత్తే మిథ్య అంటుంటాం). విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి వినన్ చూడన్ మూర్కో తగుల చేవులన్ వెల్లడిగ నె
ల్ల నేనే మొత్తంబౌదునని యతడే లంకె నిడుచో
కనన్ తానెన్నాళ్ళుండునిది అతడాకన్ కలగు నం
త నిందే నిల్వంబోదిది యనుట తాతా! చెదరితే

# 65

अनाघ्राते पुष्पे घनवनगते सौरभयुते
प्यसंवेद्या कर्तु विरचनकला संततभयात् ।
वदामोऽविद्यां त ज्जगदधिगतं ज्ञानविषयं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అనాఘ్రాతే పుష్పే ఘనవనగతే సౌరభయుతే
ప్యసంవేద్యా కర్తు ర్విరచనకళా సంతతభయాత్।
వదామోఽవిద్యాం త జ్జగదధిగతం జ్ఞానవిషయం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

దట్టమైన అడవిలో వుండి, సౌరభంతో కూడినా వాసన చూడబడనటువంటి పుష్పంలో కూడా నీ సృష్టి కళ మాకు అర్థం కాకుండా ఉంటుంది. కానీ నిత్య చపలతతో మేము ఆ విషయముల నుండి పుట్టిన భయం కారణంగా దానిని(జగత్తు) గూర్చిన ఆలోచనను అవిద్య అంటున్నాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి గుబాళింపన్ తావుల్ విరిసె నడవిన్ క్రొత్త విరి తా
ను బాగై కానీ మూర్కొనరెవరు నున్ చూడనది గుం
డె బేజారౌ నీ చేత నెఱుగమి దానిన్ [1]మసటుగా
దబాయింపంగా నేర్చితిమి విను తాతా! చెదరితే

1. అవిద్య

# 66

वयं ज्ञानोन्मत्ताः परिकृतपुरणादिकथनाः
जडे जीवेऽसक्ता इव सततनाट्या धनधियः ।
अहं ब्रह्मास्मीति प्रकटनरताः स्थेमवचनैः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

వయం జ్ఞానోన్మత్తాః పరికృతపురాణాదికథనాః
జడే జీవేఽసక్తా ఇవ సతతనాట్యా ధనధియః।
అహం బ్రహ్మాస్మీతి ప్రకటనరతాః స్థేమవచనైః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

మేము జ్ఞానోన్మత్తులం. పురాణ కథలను మా పరివారంగా చేసుకున్నవారం. ఈ జడంమీదా, జీవంమీద ఆసక్తి లేనట్లు నటిస్తుంటాం. మనసేమో ధనం మీద .అహం బ్రహ్మాస్మి అని గట్టిగా ప్రకటిస్తుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి అవేవో ప్రాఁబుక్కింటికత లెఱుకౌరా! మిగులనై
కవంగూడన్ తిక్కె అదియొకటియే కాని ఇకనే
వి వీనుల్ చేర్పంబోమనుచు నతడీవీడె యనుచున్
తవుల్కోగా సొమ్మాసపడెదము తాతా! చెదరితే?

# 67

यदा विश्वं सर्वं भवति परमात्मप्रकटनं
तदा विश्वा स्चेष्टा अपि परमकप्रोत्थितपदाः ।
कुतः कर्मद्वेषः किमु करगतं कर्म कलुषं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

యదా విశ్వం సర్వం భవతి పరమాత్మప్రకటనం
తదా విశ్వా స్చేష్టా అపి పరమకప్రోత్థితపదాః।
కుతః కర్మద్వేషః కిము కరగతం కర్మ కలుషం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

విశ్వం సర్వం కూడా పరమాత్మ ప్రకటనమే అయితే ఈ విశ్వంలోని చేష్టలకు ఉనికి కూడా ఆయనే. అలాంటప్పుడు కర్మపై ద్వేషమెందుకు? చేతిలోని కర్మ (పరమాత్మ) కలుషితమైనదంటారా? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఇదెల్లన్ వాడే చేసినదయినచోఎల్లనడతల్
గదింపై వాడే యుండిన యెడలనింకన్ పనులపై
నదేలా కాదంచున్ పెడసరముగా నాడుట తనం
తఁదానేయౌ నాయా పనులు చెడొ? తాతా! చెదరితే

## 68

अभावः प्राग्रूपः प्रतियुगपि तस्योभयगतिं
विधित्सु र्बन्धोऽ सौ भवति परमात्मा जगदपि ।
भवेद्यावद्बन्ध स्तदवधि न मिथ्या न विदितं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అభావః ప్రాగ్రూపః ప్రతియుగపి తస్యోభయగతిం
విధిత్సు ర్బన్ధోఽ సౌ భవతి పరమాత్మా జగదపి।
భవేద్యావద్బన్ధ స్తదవధి న మిథ్యా న విదితం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

ప్రాగభావం, దాని ప్రతియోగి(కార్యం).. ఈ ఉభయగతుల స్థితిని కలిగించడం కోసం రెండింటికి మధ్య బంధం ఏర్పడుతుంది. ఆ బంధమే పరమాత్మ. ఆ బంధమెంత కాలం ఉంటుందో అంత కాలం జగత్తు కూడా ఉంటుంది. అప్పుడది మిథ్య ఎలా అవుతుంది? కానీ ఆ విషయం మాకు తెలియట్లేదు. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు

### అచ్చతెనుఁగు

శిఖరిణి కనంగా మున్ లేనట్టి దిపుడు తాన్ కల్గ కలుగున్
చనంగా రెండింటన్ ముడి తఱుల నా సాకిరతడై
పెనన్ నిల్వన్ చేతల్ చెడుటెటులెప్డే నెఱుగ కిం
త నుండంబోదంచున్ పలికెదము తాతా! చెదరితే

# 69

परात्मा जीवात्मा जगदपि समानस्थितियुता
न्यनन्यज्ञातत्वा दनुगतजनित्वा दपरधा ।
स्वरूपप्राप्तित्वात् पुनरिह वयं भिन्नकथनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

పరాత్మా జీవాత్మా జగదపి సమానస్థితియుతా
న్యనన్యజ్ఞాతత్వా దనుగతజనిత్వా దపరధా।
స్వరూపప్రాప్తిత్వాత్ పునరిహ వయం భిన్నకథనాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

పరాత్మ, జీవాత్మ జగత్తు(జడం) కూడా సమాన స్థితి కలిగినవే. ఇతరులెవ్వరికీ తెలియకుండా వుంది కాబట్టి పరాత్మ, పుట్టుక కొనసాగింపు జరుగుతోంది కాబట్టి జీవాత్మ, మరొక స్వరూపం పొందుతోంది కాబట్టి జడం సమాన స్థితి కలిగి వున్నాయి. అయితే మేమేమో ఇక్కడ విభిన్నంగా చెబుతుంటాం. విధాతా! సృష్టిగతిని కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి పయిన్ వాడున్ పుట్టుల్ గనెడు నతడున్ బండసరుకుల్
మెయిన్ వేరుల్గారెఱుక విడియౌ మేన్గనమియున్
కయిన్ పల్ పుట్టుల్ కల్గుట కదలమిన్ కన్పడు నటుల్
కుయో మొట్లో తాతా! యనెద మెదొ నీకున్ చెదరెనే?

# 70

सुखं वा दुःखं वा नहि नियमितं नापि नियतं
विभिन्नत्वाच्चेतोगतिकृतिफलानां प्रतिजनम् ।
परं स्याद्वा नित्यं सुख मिह जगद्दुःख मिति न
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సుఖం వా దుఃఖం వా నహి నియమితం నాపి నియతం
విభిన్నత్వాచ్చేతోగతికృతిఫలానాం ప్రతిజనమ్।
పరం స్యాద్వా నిత్యం సుఖ మిహ జగద్దుఃఖ మితి న
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

సుఖమైనా, దుఃఖమైనా నియతంగానూ వుండవు, నియమించబడీ వుండవు. ప్రతి వ్యక్తిలో కూడా గతి, కృతి, ఫలం భిన్నంగా ఉంటాయి. పరం నిత్యమూ, సుఖమూ కావొచ్చు, కానీ జగత్తు దుఃఖమంటే ఎలా? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఒకండేడ్వన్ నవ్వన్ మరొకడటులే ఉండవు కదా!
ఎకాయెక్కిన్ పోకల్ పని దిగుబడుల్ హెగ్గడులుగా
ఇకన్ పై నంతా ఉన్నది ఒక సుకంబే అగుత దా
నికిన్ దీనిన్ తాతా! వగపొకటె యందే? చెదరితే

# 71

असि त्वं मुद्रूपो मुदभिचरणो मुत्प्रगुणितो
मुदादाने हेतु र्निखिलजगत स्त्वत्परिकराः ।
वयं त्वीर्ष्यादीर्णा जगदभिभवक्लिन्नमनसः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అసి త్వం ముద్రూపో ముదభిచరణో ముత్ప్రగుణితో
ముదాదానే హేతు ర్నిఖిలజగత స్త్వత్పరికరాః।
వయం త్వీర్ష్యాదీర్ణా జగదభిభవక్లిన్నమనసః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

నీవు ఆనందరూపుడవు. ఆనంద సంచారివి. ఆనందం చేత హెచ్చింపబడినవాడవు. నిఖిల జగత్తుకూ ఆనందాన్ని సమకూరడానికి కారణమైనవాడవు. కానీ, మేము ఈర్ష్యతో బద్ధలై జగత్తును ఎదిరించడంతో ఖేదపడుతున్నాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి [1]పసే నీవౌచున్ దాన తిరుగుచుపైపై పెరుగుచున్
వెసన్ తానెల్లన్ కల్గుటకు [2]బిస నీవే యగుదువే
కసిన్ మేమో [3]ఈసే బ్రతుకగుచు ముక్కల్ సలుప [4]మం
దసంబెల్లన్ కన్గొందు వటులనె తాతా! చెదరితే?

1. పస=ఆనందం, 2.బిస=కీలకం, 3.ఈసు=ఈర్ష్య, 4. మందసం=పెట్టె(భూగోళం)

# 72

रजःप्रख्यं तत्त्वं तव भुवनसृष्टिप्रकरणे
ततो जातं कार्यं भवति हि रजःप्राय मपि किम् ।
वयं सत्त्वं मुख्यं प्रकटनपरा राजसगुणाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

రజఃప్రఖ్యం తత్త్వం తవ భువనసృష్టిప్రకరణే
తతో జాతం కార్యం భవతి న రజఃప్రాయ మపి కిమ్?
వయం సత్త్వం ముఖ్యం ప్రకటనపరా రాజసగుణాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

భువనాన్ని సృష్టించే ప్రకరణంలో నీ తత్త్వం రజోగుణమే. ఆ రజోగుణం నుండి పుట్టిన కార్యమే ఈ జగత్తు, అదీ రజోగుణప్రాయమే అవుతుంది కదా (కారణగుణాలు కార్యంలో సంక్రమిస్తాయి గదా)! కానీ, మేమేమో రజోగుణంతో ఉంటూ సత్త్వం ప్రధానమని చెబుతుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి గొనంబుల్ మూడింటన్ [1]నడిమిది పొసంగున్ నలువవై
కనంగా చేతల్ నీవొనరుచుట నే కాడికి నదే
మనంగా మాలో నెల్లెడ తెలివియౌ మాట [2]తొలియౌ
గొనంబే తాతా! మేలన కుదురునొక్కో? చెదరితే?

1. నడిమిది = రజోగుణం, 2. తొలి = సత్త్వగుణం

## 73

न बद्धोऽयं जीव स्तदनुगतिकभ्रान्तिनिहत
स्तथाभावाविष्टः स्वयमपि निबद्धो भवति हि ।
यथालाने दन्ती कथ मिह मुमुक्षुत्वफलनं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

న బద్ధోఽయం జీవ స్తదనుగతికభ్రాన్తినిహత
స్తథాభావావిష్టః స్వయమపి నిబద్ధో భవతి హి।
యథాలానే దన్తీ కథ మిహ ముముక్షుత్వఫలనం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

జీవుడు బద్ధుడు కాడు. దానిని అనుసరించి ఆలోచిస్తూ వున్నందువలన ఆ భ్రాంతితో దెబ్బతిని అలాంటి భావాలకు లోనై తనను తానే బంధించుకుంటున్నాడు. ఏనుగు తాను బంధీ అయి ఉన్నాననే భావనతో చిన్న కట్టుకొయ్యకు బంధీ అయినట్టుగా.. జీవుడికి బంధమనేదే తాను కల్పించుకున్నదే అయినప్పుడు ఇక ముముక్షత్వం, తత్ఫలం ఏముంటుంది? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి [1]యవారం బెవ్వారో పలుపిడిరనే అట్లతుకుకో
నవే అవ్వే బుట్టన్ తలపులయి తానై తగులుటల్
దివాణంబందేస్గున్ చిఱుగొలుసుబందెన్ నిలుచుటై
న [2]విడ్పెట్లొ తాతా! అది కలుగునా? చెదరితే?

1. యవారం = వ్యవహారం, 2. విడ్పు = మోక్షం

## 74

उपस्थातव्यं मे प्रकृतिविपुलां सुंदरतरां
तनुं धृत्वा स्मृत्वा प्यनुसृतजनिज्ञानविभवम् ।
जगद्रूपेणेति त्व मिह तु वयं त्याज्यजगतः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

ఉపస్థాతవ్యం మే ప్రకృతివిపులాం సున్దరతరాం
తనుం ధృత్వా స్మృత్వా ప్యనుసృతజనిజ్ఞానవిభవమ్।
జగద్రూపేణేతి త్వ మిహ తు వయం త్యాజ్యజగతః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

నీవు జగత్తు రూపంగా వుండాలని అనుకొని ప్రకృతి చేత విశాలతరమై, సుందరమైన తనువుతో ఈ జగత్తుగా మారావు. నీవు రూపొందిన వివిధజన్మల జ్ఞానాన్ని స్మరిస్తుంటావు. కానీ మేమేమో ఈ జగత్తును త్యజించాలని చెబుతుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి ఇదంతా నీవేయై వనరులమెయిన్ హెచ్చి నలుగడల్
పదింతల్ సొంపుల్ విందుగ కనులకున్ పల్ తెఱగులన్
కదా! వెన్వెంటన్ పుట్టువులతలపుల్ గాంచెదు బళీ!
అదే దీనిన్ తాతా! విడువమననౌనా? చెదరితే?

## 75

सति ब्रह्मज्ञाने तदितरसमस्तं तुष इह
समर्चासंध्याने भजन मथवा योजनमपि ।
विनीयोगाभावे परमवि दपि व्यर्थपदवी
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సతి బ్రహ్మజ్ఞానే తదితరసమస్తం తుష ఇహ
సమర్చాసంధ్యానే భజన మథవా యోజనమపి।
వినీయోగాభావే పరమవి దపి వ్యర్థపదవీ
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

బ్రహ్మ జ్ఞానముంటే అర్చించడం, ధ్యానించడం, భజన చేయడం, యోగం ఇవన్నీ కూడా ఊకయే. కానీ ఈ లోకంలో వినియోగం లేకపోతే ఆ పరమాత్మజ్ఞానం కూడా వ్యర్థమే. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి అదే ఉండంగా అచ్చెతెలివి మరింకన్ని వలెనే
ఎదేన్ ఊకౌ కొల్పుల్ తలపు పిలుపెందే నిలుపులున్,
మదిన్ దాగన్ మొద్దౌ తెలివి, నడతన్ మన్నగవలెన్
కదా! తాతా! మాకెందుకిటులగు పోకల్? చెదరితే?

## 76

स्वयं शक्तेः स्फोटो जगदिदमभूत् सैव परमो
भुवि ख्यात स्तत्ता तु जगदिति वेदान्तवचनम् ।
परोह्यात्मा नित्यो जगदपि तथा साकृतिभिदं
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

స్వయం శక్తేః స్ఫోటో జగదిదమభూత్ సైవ పరమో
భువి ఖ్యాత స్తత్తా తు జగదితి వేదాన్తవచనమ్।
పరోహ్యాత్మా నిత్యో జగదపి తథా సాకృతిభిదం
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ

### తాత్పర్యం

శక్తియొక్క స్వయం విస్ఫోటనమే ఈ జగత్తుగా ఏర్పడింది. ఆ శక్తినే పరముడని వ్యవహరించి, తద్రూపమే జగత్తని వేదాంతగ్రంథాలు అంటున్నాయి. పరమాత్మ నిత్యం. తద్రూపమైన జగత్తూ నిత్యమే. కాకపోతే ఆకృతిలో భిన్నత ఏర్పడుతుంది. విధాతా! సృష్టిని కొనసాగించే కార్యక్రమంలో నువ్వెలా విఫలుడ వవుతున్నావ్?

### అచ్చతెనుఁగు

శిఖరిణి తనంతన్ ప్రేలన్ సత్తి అపుడొదవెన్ తానిది,అదే
కనంగా పెద్దన్ పేర్గన నతనిరేకల్ పొదవుటే
చేనెన్ మొత్తంబై అన్ తొలినుడికొనల్ సాగు నతడే
అనన్ తాతా! సాగుంగద ఇదియు మాటై చెదరితే?

# 77

करे कर्मप्रख्यं निवसति महत् ब्रह्म परमम्
ततः प्राणी कुर्वन् जनहितविधिं जन्मकलितम् ।
उपेयादात्मार्चाफलमपि वयं कर्मविरताः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

కరే కర్మప్రఖ్యం నివసతి మహత్ బ్రహ్మ పరమం
తతః ప్రాణీ కుర్వన్ జనహితవిధిం జన్మకలితమ్।
ఉపేయాదాత్మార్చాఫలమపి వయం కర్మవిరతాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

జీవుల చేతిలో కర్మ అనే పేరుతో ఆ పరమాత్మ నివసిస్తున్నాడు. (కర్మేతి హస్తయోః – తైత్తరీయోపనిషత్తు). అందువల్ల ఏ ప్రాణి అయినా జనహితం కోరి విధింపబడి, పుట్టుకతో సంక్రమించిన పనులు చేస్తుంటే ఆ పరమాత్మను ఉపాసించినట్టే. కానీ మేము నీ సంకల్పానికి విరుద్ధంగా కర్మ విరక్తులమవుతున్నాం. విధాతా! సృష్టిగతి కొనసాగించే విషయంలో నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

తే.గీ. పదుగురకు మేలుసేసెడి పనులసేత
పెద్దవెలుగుకొలుపని చెప్పితివి మేము
పనులనెగగొట్టుటే గొప్ప యనెద మిట్టి
పుట్టుకిడితివి తాత తప్పు జరిగినదొ?

78

न निन्द्यादन्नं तद् व्रतमिति महद्बोधनविधा
विशिष्टा विज्ञानेऽविहितमिति तत्कुत्सनपराः ।
वदामो रागाप्तं वद न विहितं किन्नु भवता
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

న నిన్ద్యాదన్నం తద్ వ్రతమితి మహద్బోధనవిధా
విశిష్టా విజ్ఞానేఽవిహితమితి తత్కుత్సనపరాః।
వదామో రాగాప్తం వద న విహితం కిన్ను భవతా
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

అన్నాన్ని నిందించకూడదనేది వ్రతమని మహాత్ముల బోధన(అన్నం న నిన్ద్యాత్. తద్ వ్రతమ్.. తైత్తిరీయోపనిషత్.) కానీ మేము చాలా తెలివిగలవారము. అది విధింపబడలేదని (వేదవిహితము కాదని), దాన్ని తక్కువ చేసి నిందిస్తుంటాము. అది రాగము చేత ఏర్పడినదంటాము. చెప్పు, నువ్వు మమ్మల్ని అన్నం తినవద్దని అన్నావా? విధాతా! సృష్టిగతిని కొనసాగించే విషయంలో నువ్వెందుకు విఫలుడవుతున్నావు?

## అచ్చతెనుఁగు

చం. తొలినుడిపైకొసల్ పలికె దూరకుడోగిరమంచు పెద్దలున్
పలికెద రట్టులే అయిన ప్రానుడి కాదని తిండికోసమై
కలవరమందరానుచు గట్టిగ దానిని తిట్టుచుందుమో
నలువ! తినంగరాదనెదొ? నాణెపుపుట్టుక నీయకుంటివో?

# 79

इदं विश्वं विष्वक् प्रतिसुमरजोद्भावितगति
प्रवृत्तं ज्ञात्वैव प्रतिकणमधूच्छिष्टमतयः ।
अनुत्सेका वाक्षु प्रतिपदसमाक्रान्तविरताः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

ఇదం విశ్వం విష్వక్ ప్రతిసుమరజోద్భావితగతి
ప్రవృత్తం జ్ఞాత్వైవ ప్రతికణమధూచ్ఛిష్టమతయః।
అనుత్సేకా వాక్షు ప్రతిపదసమాక్రాన్తవిరతాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఈ విశ్వం అంతా పువ్వులోని రజస్సు (పుప్పొడి) చేత పుట్టింపబడినఫలంగా మారే విధంగా ఉంటుంది. ఆ విషయం తెలిసే మేము ప్రతి కణములో వుండే మధువును (వసంతాన్ని) ఆస్వాదించాలనే కోరికతో ఉంటాము. ఇలా ఉంటూ కూడా శుష్క వచనాలతో వైరాగ్యాన్ని పలుకుతుంటాము. విధాతా! సృష్టిగతిని కొనసాగించే విషయంలో నువ్వెందుకు విఫలుడవుతున్నావు?

## అచ్చతెనుఁగు

తే.గీ. పుడమి విచ్చినపూవులోపుప్పొడిమెయి
రూపుదాల్చిన పండు తీరున నెసంగు
టెఱిగియును తేనెఁగోరుచు విఱుపులాడు
పుట్టువొసగితి తాత! తప్పు జరిగినదొ?!

# ౮౦

विषे पीयूषेऽपि प्रभवतु समत्वं स्थितिपरं
गुणैश्चेष्टाभिर्वा न हि न हि समत्वं समफलम् ।
अभिन्ना दृष्टौ स्यात् पर मिह वयं सृष्टिवदनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

విషే పీయూషేఽపి ప్రభవతు సమత్వం స్థితిపరం
గుణైశ్చేష్టాభిర్వా న హి న హి సమత్వం సమఫలమ్।
అభిన్నా దృష్టౌ స్యాత్ పర మిహ వయం సృష్టివదనాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

విషంలోనూ, అమృతంలోనూ సమత్వం ఉంటుంది. కానీ, అది స్థితిపరమైనది. గుణాలను, చేష్టలను బట్టి సమత్వం కానీ సమఫలం కానీ వుండవు. కాబట్టి సృష్టిలో భేదం సహజం. దృష్టిలో అభిన్నత ఉండాలి కానీ మనం సృష్టి అభిన్నమని మాట్లాడుతుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి విసంబున్ వేల్పుందిండియు సరియనన్ విన్కికి తగున్
పొసంగంబోవౌరా! గొనములు పనుల్ పోల్ప నెపుడే
నెసంగున్ తేడాల్ పుట్టుకల కనుటే ఎక్కటిగ నొ
ప్పు సామీ! తాతా! పుట్టుకొాకటెటులబ్బో! చెదరితే?

## 81

जगन्मिथ्या भ्रान्ति श्चल मचल मित्यादिविशयः
भवेद्वा ज्ञानांशः भवति न फलं तेन किमपि ।
न यावद्दृष्टं तत् व्यवहृतिपदे नित्यगमने
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

జగన్మిథ్యా భ్రాన్తి శ్చల మచల మిత్యాదివిశయః
భవేద్వా జ్ఞానాంశః భవతి న ఫలం తేన కిమపి।
న యావద్దృష్టం తత్ వ్యవహృతిపదే నిత్యగమనే
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

జగత్తు మిథ్య, భ్రాంతి, చలం, అచలం ఇవన్నీ కూడా జ్ఞాన విషయాలైతే కావొచ్చు. కానీ ఆ జ్ఞానం, వ్యవహార స్థానంలో నిత్యజీవితంలో కనిపించనంతకాలం దాని వలన వచ్చే ఫలమేమీ లేదు. (మేమలా జ్ఞానాన్ని వినియోగించటం లేదు) విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి బలే తెల్విన్ మాకిచ్చితి వగుపడన్ పాడగు చనున్
కలన్ కన్పింపన్ నిల్వనటులె యనంగా గడగడా
లలిన్ బారంబాటై చదివెద మదేలా బ్రతుకులో
తళుక్కై తాకన్పట్టదెచటను తాతా! చెదరితే?

# 82

अनित्यत्वे कश्चि न्निहितहृदयो जीवति भुव
स्तथा नित्यत्वेऽन्यो भवति च तयोः काऽस्ति विभिदा।
न चेद्वृत्तौ भेदो निजपरविशेषैक्यगणना
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అనిత్యత్వే కశ్చి న్నిహితహృదయో జీవతి భువ
స్తథా నిత్యత్వేఽన్యో భవతి చ తయోః కాఽస్తి విభిదా।
న చేద్వృత్తౌ భేదో నిజపరవిశేషైక్యగణనా
కుతో వా ధాత స్త్వం భవసివిఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఒకడు లోకం యొక్క అనిత్యత్వభావనలో జీవిస్తుంటాడు. మరొకడు నిత్యత్వభావనతో జీవిస్తుంటాడు. 'తన', 'పర' రెంటినీ సమానంగా చూడలేకపోతే, ఇద్దరి లౌకికప్రవర్తనలో తేడా లేకపోతే వీరిద్దరికీ భేదమెక్కడ? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఒకండేమో మొత్తంబిది నిలువదోహో! అనును వే
రొకండేమో మొత్తంబిది నిలుచు నోహో! అనును దా
నికిన్ వేఱై ఒప్పన్ తన కొకటియై నిల్వని మదిన్
[1]పోకాలన్ తాతా! ఇద్దరికి ఎడమౌనో? చెదరితే

1. పోకాలన్ = పోగా

# 83

यथा सृष्टौ तुष्टि र्भवति परमे कारणगुणे
तथैवात्रापि स्यात् समजनिमतां किन्तु सततम् ।
विरक्तावामोदं वय मिह वदामो गुण इति
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

యథా సృష్టౌ తుష్టి ర్భవతి పరమే కారణగుణే
తథైవాత్రాపి స్యాత్ సమజనిమతాం కిన్తు సతతమ్।
విరక్తావామోదం వయ మిహ వదామో గుణ ఇతి
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

కారణ గుణములు కలిగి పరమాత్మ సృష్టి విషయంలో ఆనందిస్తున్నాడు. అలాగే ఇక్కడ కూడా పుట్టుక కలిగిన ప్రాణుల కందరికీ సృష్టి విషయంలో ఆనందముండాలి. కానీ, మేమిక్కడ విరక్తిలో కలిగే ఆనందాన్ని గొప్ప అని చెబుతుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి [1]కతంపున్ తీరుల్ కల్గి అతడిచటన్ గాంచఁ [2]దనివ
ట్టి తీరై పుట్టుంగన్న పలువుర మట్లే తలఁపకే
ము [3]తోతెంపే చెడ్డంచు తలచుటకే పొంగెదమి
ట్లు తార్మారై తాతా! తికమక పడితేలో? చెదరితే?

1. కతము = కారణము, 2. తనివి = ఆనందము, 3. తోతెంపు = పుట్టుట

# 84

विपश्चित् कश्चित् स्या त्कृतिसकलभूमोक्षवरदः
यथाकाङ्क्षं कैश्चित् तदनु लघु भूर्जीवरहिता।
सिसृक्षोर्लोकस्य प्रियतर मिदं किन्नु भविता
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ॥

విపశ్చిత్ కశ్చిత్ స్యా త్కృతిసకలభూమోక్షవరదః
యథాకాంక్షం కైశ్చిత్ తదను లఘు భూర్జీవరహితా।
సిసృక్షోర్లోకస్య ప్రియతర మిదం కిన్ను భవితా
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

కొంతమంది కోరుతున్నట్టుగా, ప్రయత్నపూర్వకంగా భూలోకంలోని సకల ప్రాణులకూ మోక్షం ఇప్పించగలిగిన వాడు ఎవడో ఒక పండితుడుంటే ఉండవచ్చు. ఆ తర్వాత త్వరలోనే భూమి జీవరహితమై పోతుంది కదా. కానీ, ఈ లోకాలను సృష్టించిన వాడికి ఇదేమైనా ఇష్టమైనదవుతుందా? విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు??

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఎవండో [1]పెన్పొజ్జై ఇచట గలవారెల్లరకు తా
ను వేవే కూర్పంగా [2]విడుపు తగియుండున్ సరి అనం
గ వెన్కన్ తాన్ [3]నిప్పచ్చరపు పుడమిన్ కాంచ చేవియే?
[4]నివాళుల్ తాతా! మీ కిరువురకు నింతే! చెదరితే?

1. పెన్పొజ్జ = పెద్దపండితుడు, 2. విడుపు = మోక్షం, 3. నిప్పచ్చరము = శూన్యం,
4. నివాళుల్ = మంగళారతులు

# 85

जनेर्मुक्तिः काऽपि प्रियतमदशा मानसगता
न खिन्ना नो भिन्ना न हि जगदतीता न विरता।
यथाप्राप्ते चेष्टानुगुणफलिते निश्चलमतिः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

జనేర్ముక్తిః కాఽపి ప్రియతమదశా మానసగతా
న ఖిన్నా నో భిన్నా న హి జగదతీతా న విరతా।
యథాప్రాప్తే చేష్టానుగుణఫలితే నిశ్చలమతిః
కుతో వా ధాత స్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

పుట్టుక నుంచి మోక్షం – అది ఒక మానసిక దశ. అక్కడ దుఃఖముండదు, భేదముండదు. అది జగత్తుకు అతీతమైనది కాదు, విరక్తి ఉండేదీ కాదు. చేష్టలకు అనుగుణమైన ఫలితం వచ్చినపుడు నిశ్చలమైన బుద్ధితో ఉండగలిగే స్థితియే మోక్షం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి మెయింగొంటన్ కంటెన్ [1]విడుపుగొనుటే మేలగు నొకిం
తయున్ తా నుండంబోదచట [2]వగపన్నన్ [3]విడితనం
బయారే నిక్కంబౌ నదియు మది యందౌటయె ఎదో
పయింబడ్డన్ తాతా! వగవమి యె చెప్పన్ చెదరితే?

1. విడుపు = మోక్షం, 2. వగపు = దుఃఖం, 3. విడితనం = భిన్నత

यतो लोकेऽशोकेप्यनुकृतिरसाच्छोकजननं
ततो भीतीभूता निजपरिभवप्रोतमनसः ।
वयं शश्वज्जन्मान्तरविरहितत्वे कृतधियः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

యతో లోకేఽశోకేప్యనుకృతిరసాచ్ఛోకజననం
తతో భీతీభూతా నిజపరిభవప్రోతమనసః।
వయం శశ్వజ్జన్మాన్తరవిరహితత్వే కృతధియః
కుతో వా ధాత స్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

శోకరహితమైన ఈ లోకంలో అనుకరణం మీద వుండే ప్రేమ వలన శోకం ఏర్పడుతోంది. దానితో భీతావహులమై పరిభవాల (అనాదరణ) చేత గ్రుచ్చబడిన మనసు గలవారమై ఎప్పుడూ కూడా పునర్జన్మ ఉండకూడదని ఆలోచిస్తుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు??

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఎటన్ లేనేలేకుండెడి [1]వగపు తోడెంచ కలుగున్
కటా! దానన్ పుట్టున్ బెరుకు కలకల్ కందు నెడదల్
నిటారై నిల్చున్ బుద్ధి నిక పుటుకెంతే చెడనుచున్
పెటాకౌ తాతా! మా తలపు ఇది ఒప్పే?చెదరితే?

1. వగపు = దుఃఖం

क्रमः कोप्येतस्मिन् प्रचलति जगत्यात्तनियतिः
जडानां जीवानामपि सततसंवर्तनचणः ।
वयं वैफल्याक्ताः जननविषयासक्तमनसः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

క్రమః కోప్యేతస్మిన్ ప్రచలతి జగత్యాత్తనియతిః
జడానాం జీవానామపి సతతసంవర్తనచణః।
వయం వైఫల్యాక్తాః జననవిషయాసక్తమనసః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఈ జగత్తులో జడాలనైనా, జీవాలనైనా ప్రవర్తింప చేయడంలో నేర్పు కలిగిన ఒక క్రమం, ఆనుపూర్వి ఉంటుంది. అది ఒక నియమబద్ధంగా ఉంటుంది. మేమేమో వైఫల్యం మాకు అంటుకున్నందువల్ల మళ్ళీ పుట్టాలనే దానిపై ఆసక్తి లేకుండా వున్నాము. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి [1]సవిన్ పుట్టింపన్ [2]మొద్దుల, [3]నుసురులన్ చాలెదవుగా
అవెల్లన్ నీ తీర్పున్ బడియె చను మేమటుల గా
క వేటౌ త్రోవన్ పోవుచు చెడుచు నింకన్ వలదు పు
ట్టువే తాతా! బాబోయనెద మిట నిట్టుల్ చెదరితే?

1. సవిన్ = అనుకున్న వరుసలో 2. మొద్దులు = జడములు 3. ఉసురులు = జీవములు

असद्भूतावादावसदपि च सत्तत्र गहने
ह्यभावः प्राग्रूपो व जनितमसत् तत्र पुरुषः ।
ततो विश्वं तर्हि क्व नु भवति माया सुकृतधीः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అసద్భూతావాదావసదపి చ స త్తత్ర గహనే
హ్యభావః ప్రాగ్రూపో వ జనితమసత్ తత్ర పురుషః।
తతో విశ్వం తర్హి క్వ ను భవతి మాయా సుకృతధీః!
కుతో వా ధాత స్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ప్రారంభంలో అసత్తు, సత్తు కూడా లేవు. (నాసదాసీత్ నోసదాసీత్ తదానీం..ఋగ్వేదం). ఆ గహనంలో ప్రాగభావంలాగా అసత్తు అనేది పుట్టింది. ఆ అసత్తులో నుండి పురుషుడు వచ్చాడు. ఆ పురుషుని నుండి విశ్వం వచ్చింది. ఇక్కడ మాయ ఎక్కడుంది? ఓ తెలివైన విధాతా! నువ్వు ఏ కారణంగా దేనిలో విఫలుడవుతున్నా వనగలం?

## అచ్చతెనుఁగు

శిఖరిణి మొదల్లేవుంటల్ పోవుట లపుడటన్ పుట్టె చనుట
ప్డు దిగ్గెన్ దానన్ పెన్మగడు నతనన్ మొత్తమగుటన్
మదిన్ తావెందుండెన్ తెలియమికి కొంపల్ మునిగెనే?
అదేదో తాతా! తెల్లముగ ననవేలా? చెదరితే?

# 89

रसाभासः स्याद्वा क्वचिदपि कथं तेन भविता
असत्यस्संसारः किमु विगलिताङ्गस्य गणना ।
भवेन्नो सामान्येऽपचितकुसुमा नैव लतिका
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

రసాభాసః స్యాద్వా క్వచిదపి కథం తేన భవితా
అసత్యస్సంసారః కిము విగళితాంగస్య గణనా।
భవేన్నో సామాన్యేఽపచితకుసుమా నైవ లతికా
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ఎక్కడైనా రసాభాసం ఉంటే ఉండొచ్చు, అంత మాత్రం చేత సంసారం అసత్యమెలా అవుతుంది? అంగవైకల్యం వస్తే ఆ ద్రవ్యానికి జాతిలో గణనముండదా? పూలు కోసేసినంత మాత్రాన తీగ తీగ కాకుండా పోతుందా? విధాతా! నువ్వు ఏ కారణంగా దేనిలో విఫలుడవవుతున్నా వనగలం?

## అచ్చతెనుఁగు

శిఖరిణి కలల్ గా కల్గన్ [1]కల్లచేవు లయినన్ కల్ల యగునే
చెలంగం బోదే [2]ఉన్కి, మెయి నలుగన్ చెల్లదె గుమిన్
తలన్ పెక్కె కానంబడు విరుల కోతన్ తలిరులన్
వెలన్ తీగై తాతా! పిలువబడ [3]దందే? చెదరితే?

1. కల్లచేవులు = రసాభాస, 2. ఉన్కి= సంసారం, 3. అందే = అందువే

# 90

न पापं नो पुण्यं भवति परमज्ञानविभवे
परत्वेन ज्ञाते तदुभयपदे क्वास्ति विभिदा ।
इहैव स्याद्भेदो दृशि पुनरभेदो भवतु नः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

న పాపం నో పుణ్యం భవతి పరమజ్ఞానవిభవే
పరత్వేన జ్ఞాతే తదుభయపదే క్వాస్తి విభిదా।
ఇహైవ స్యాద్భేదో దృశి పునరభేదో భవతు నః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

పరమాత్మ జ్ఞానముంటే పాపం, పుణ్యం అంటూ వుండవు, ఆ రెండూ కూడా పరమాత్మే అని తెలుసుకున్నాక ఇక భేదమెక్కడ? ఉంటే భేదం ఇక్కడే ..అయినా మన దృష్టిలో సతతమూ అభేదముండాలి. విధాతా! ఏ కారణంగా నువ్వు దేనిలో విఫలుడ వవుతున్నా వనగలం?

## అచ్చతెనుఁగు

శిఖరిణి కలండొక్కండే అచ్చేతెలివదియే, కల్గినదనన్
కలన్ రెండౌచున్ మంచి చెడు గనుటల్ కాదచటనేన్
చెలంగున్ రెండన్నట్టిదిట, మదికిస్సీ! తగదుగా
తలా కొంచెంబున్ పంచుట తగునె? తాతా! చెదరితే?

# 91

अथ स्वान्ते काम स्तदनु च तदर्थार्थविचितिः
तयो र्भूयान् धर्मो नियमनपरः सृष्टिगुणतः ।
ततः कार्यं मोक्ष स्तदनुजनितोऽयत्नफलितः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

అథ స్వాన్తే కామ స్తదను చ తదర్థార్థవిచితిః
తయో ర్భూయాన్ ధర్మో నియమనపరః సృష్టిగుణతః।
తతః కార్యం మోక్ష స్తదనుజనితోఽయత్నఫలితః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

ప్రాణి పుట్టిన తర్వాత మనసులో కోరిక పుడుతుంది. ఆ తర్వాత దాని కోసం అర్థాన్వేషణ జరుగుతుంది. ఆ రెంటిని ధర్మం నియమిస్తుంది. ఆ నియమనం సృష్టిధర్మాన్ని బట్టి ఉంటుంది. అదంతా కారణం. దాని కార్యమే మోక్షం. విధాతా! నువ్వు ఏ కారణంగా దేనిలో విఫలుడ వవుతున్నా వనగలం?

## అచ్చతెనుఁగు

శిఖరిణి మొదల్ బుట్టన్ [1]కోర్కుల్, నెఱయ నవి [2]సొమ్ముల్ వెదకుటం
త దమ్మమ్మారెంటిన్ నడుపు నది [3]చేతన్ తగి చనం
గ దానన్ కల్గుంబో [4]విడుపు పుడమిన్ కాదు గదవే
అదే తానై తాతా! వరుస ఇది కాదా? చెదరితే?

1. కోర్కుల్ = కామం, 2. సొమ్ముల్= అర్థం, 3. చేత = సృష్టి, 4. విడుపు = మోక్షం

# 92

न निन्द्यादन्नं नो जलहुतभुजौ नापि पृथिवीं
न वा सृष्टिं लोकान् परममपरं भूजलखगान् ।
प्रवृत्तिं वृत्तिं वा न हि जगदिदं नापि जनुषः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

న నిన్ద్యాదన్నం నో జలహుతభుజౌ నాపి పృథివీం
న వా సృష్టిం లోకాన్ పరమమపరం భూజలఖగాన్।
ప్రవృత్తిం వృత్తిం వా న హి జగదిదం నాపి జనుషః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

అన్నాన్ని గాని, జలాన్ని గాని, అగ్నిని గాని, పృథివిని గానీ, సృష్టిని, లోకాలను, పరమాత్మను, జీవులను, భూచరాలను, జలచరాలను, పక్షులను, స్వభావాలను, వృత్తులను, ఈ జగత్తును, జన్మను వేటినీ నిందించకూడదు. (ఉపనిషద్వాక్యం). విధాతా! సృష్టిని కొనసాగించడంలో నువ్వు ఏ కారణంగా దేనిలో విఫలుడ వవుతున్నా వనగలం?

## అచ్చతెనుఁగు

శిఖరిణి [1]అయిన్ బువ్వన్ నిప్పున్ పుడమి [2]వలినేదైన నలువే
[3]కయిన్ తానై తాన్ చేసిన వెవియునేన్ కన్పడని ఆ
పయిన్ పెత్తందారున్, పనుల పుటుకన్ పల్చనగు మా
ట యేనిన్ తాతా! పల్కదగదని యంటన్ చెదరితే!

1. అయిన్ = నీటిని, 2. వలిన్ = గాలిని, 3. కయిన్ = చేతితో

# 93

वयं भीताश्चेतस्तनुपरिमिते रूर्ध्वमतयो
हृदा चेष्टावाग्भ्या मपि परिणते र्भिन्नगतयः ।
वदामो मिथ्यात्वं सकलजगतोऽहृष्टमनसः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

వయం భీతాశ్చేతస్తనుపరిమితే రూర్ధ్వమతయో
హృదా చేష్టావాగ్భ్య మపి పరిణతే ర్భిన్నగతయః।
వదామో మిథ్యాత్వం సకలజగతోఽహృష్టమనసః
కుతో వా ధాత స్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

మేము మనస్సుకూ, శరీరానికీ ఉన్న పరిమితులకు మించి ఆలోచిస్తూ పనులు చేస్తుంటాం. మాటాడుతుంటాం. ఫలితాలను చూసి (ఫలితాలకు)భయపడి విభిన్నంగా అడుగులు వేస్తుంటాం. ఆ భయంలో మనసుకు తృప్తిలేనివారమై ప్రపంచమంతా మిథ్య అని చెబుతుంటాం. విధాతా! సృష్టిని కొనసాగించడంలో నువ్వు ఏ కారణంగా దేనిలో విఫలుడవుతున్నా వనగలం?

## అచ్చతెనుఁగు

శిఖరిణి మదిన్ మైఁగొల్వౌ హద్దులు మరచుచున్ మాటలు పనుల్
కుదేలౌచున్ గావింతుము దిగుబడుల్ కూర్ప వెఱప
య్యదే పెల్లై వానన్ తనివి గనకే ఆడెదము ని
ల్వదేదంచున్ తాతా! పిఱికితనమేలా? చెదరితే

यथापूर्वं धातुः सकलजगतां कल्पनमिति
प्रकल्प्याप्येतस्मिन् जगति च जनौ काऽस्ति विरतिः ।
न जानीमो बिभ्यद्धृदयकलुषा नित्यमरणाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

యథాపూర్వం ధాతుః సకలజగతాం కల్పనమితి
ప్రకల్ప్యాప్యేతస్మిన్ జగతి చ జనౌ కాఽస్తి విరతిః.
న జానీమో బిభ్యద్ధృదయకలుషా నిత్యమరణాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

కల్పానంతరం సకల జగత్తును అంతకు ముందు ఉన్నట్టుగానే విధాత సృష్టి చేస్తుంటాడని మనమే ప్రకల్పించాం (ధాతా యథాపూర్వ మకల్పయత్). అలా అయినప్పుడు ఇక ఈ జగత్తు మీద, పుట్టుక మీద విరక్తి ఎందుకో అర్థం కావడం లేదు. హృదయాలు భయ కలుషితాలు కావటంతో నిత్య మరణంతో జీవిస్తున్నాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఇదెల్లన్ మున్గంగా నలువ మరి ఇట్లే తిరిగి తా
ను దీర్చున్ పోదేదందు మిట బ్రతుకందున్ పుటుకపై
ఎదేదో పాడూసున్ వగపు విరుపే ఇంపనుటచే
కదా! తాతా! చావెంచుచు బ్రతుకు తిక్కల్ చెదరితే?

# 95

तपन्तं वर्षन्तं दिनकर मथो नीरदततिं
न वा लोकान् निन्द्या दिति परमवेदान्तवचनम् ।
विनिन्दामो सर्वान् वय मिह वृथाभ्रान्तिवचनैः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

తపన్తం వర్షన్తం దినకర మథో నీరదతతిం
న వా లోకాన్ నిన్ద్యా దితి పరమవేదాన్తవచనమ్।
వినిన్దామో సర్వాన్ వయ మిహ వృథాభ్రాన్తివచనైః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

తపించేవాడిని (అగ్నిని), వర్షాన్ని, సూర్యుడిని, మేఘాల సమూహాన్ని, లోకాన్ని నిందించ వద్దు అనేది ఉపనిషద్వాక్యం. కానీ మేమేమో ఇక్కడ వీటన్నిటిని జగత్తు భ్రాంతి అనే మాటలతో నిందిస్తున్నాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి తుదిన్ చెప్పెన్ ప్రాఁబల్కు తెగఁబలుకన్ దోసమనుచున్
మొదల్ నిప్పున్ ప్రొద్దున్ జడినిమొయిలున్ మొత్తమును మే
మదేమో కల్లౌ నెల్లయను [1]తెగడే అందుమెపుడున్
కదా! తాతా! ఎట్లబ్బెనది పెడపోకై చెదరితే?

1. తెగడు = నింద

# 96

वचोऽद्वैता श्चेष्टा स्वविचललसद् द्वैतभजनाः
स्वकीये सम्प्राप्तौ परिहृतसमाध्यात्मविषयाः ।
विनिन्दामो मिथ्या जगदिति वयं भग्नवचनाः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

వచోఽద్వైతా శ్చేష్టా స్వవిచలలసద్ ద్వైతభజనాః
స్వకీయే సమ్ప్రాప్తౌ పరిహృతసమాధ్యాత్మవిషయాః।
వినిన్దామో మిథ్యా జగదితి వయం భగ్నవచనాః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

మాటలలో అద్వైతం, చేష్టల యందు తేడాలేని ద్వైతం, స్వలాభం విషయానికి వస్తే మాత్రం అన్ని ఆధ్యాత్మిక విషయాలనూ వదిలేస్తాం. పైగా ఈ జగత్తు అంతా మిథ్య అంటూ మేము భంగమైన మాటలు పలుకుతుంటాం. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు?

## అచ్చతెనుఁగు

శిఖరిణి నుడుల్ ప్రోతల్ ప్రోగింతు [1]మొకడె అటన్చున్, నడతలో
ఎడంబే లేనట్లెప్పుడయినను [2]రెండే అగుదు మే
యెడన్ సొంతంబౌ పట్టుల నెవడు లేడే పయిన మా
కు, డాబే తాతా! నిల్వదెది యను పల్కున్ చెదరితే?

1. అద్వైతం, 2. ద్వైతం

## 97

समूहालम्बा धी रगणितजगत्स्थेमविषया
जगन्मिथ्याभावप्रकटनपराऽस्मासु जनिता ।
अशक्तव्यूहोऽयं जनगणमनोभ्रान्तिजनकः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సమూహాలమ్బా ధీ రగణితజగత్స్థేమవిషయా
జగన్మిథ్యాభావప్రకటనపరాఽస్మాసు జనితా।
అశక్తవ్యూహోఽయం జనగణమనోభ్రాన్తిజనకః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

జగత్తు యొక్క స్థిరత్వాన్ని పట్టించుకోకుండా, సమూహాలంబనంగా జగత్తు మిథ్య అనే భావనపై ఆసక్తి మాలో కల్పించబడింది. ఇది అశక్తుల చేత కల్పింపబడిన వ్యూహం. జనగణముల యొక్క మనసుకు భ్రాంతి కలిగించే సామూహికమైన ఆలోచన. విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడవవుతున్నావు?

### అచ్చతెనుఁగు

శిఖరిణి తిరంబౌ నెల్లన్ చేతయని మరచెన్ దీని గొఱియల్
తరాలైనన్ గోతన్ పడెడి నటులే దాటుటగ తీ
ర్చిరే బక్కల్ తామెల్లరను పెడదారిన్ బడుగులై
బరాబర్లై తాతా! అదె అనెద మప్పా! చెదరితే?

# ౧౪

न धीमान् नो श्रीमान् न हि सुगुणवान् नापि बलवान्
न हेतु र्नो बीजं जगदिद मिदंलक्षणमिति ।
दृढं वक्तुं तस्मा दनुभवपरे तस्य विषये
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

న ధీమాన్ నో శ్రీమాన్ న హి సుగుణవాన్ నాపి బలవాన్
న హేతు ర్నో బీజం జగదిద మిదంలక్షణమితి।
దృఢం వక్తుం తస్మా దనుభవపరే తస్య విషయే
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

## తాత్పర్యం

జగత్తు ఇలా ఈ లక్షణాలే కలిగి ఉంటుందని చెప్పగలిగిన బుద్ధిమంతుడు గానీ, శ్రీమంతుడు గానీ, గుణవంతుడు గానీ, బలవంతుడు గానీ లేడు. అలాగే కారణమూ లేదు, బీజమూ లేదు. కావున జగత్తు ఇలా ఉంటుంది అనేది అనుభవంతో మాత్రమే ఊహించి గ్రహించుకోగలం. విధాతా! అటువంటి సృష్టి విషయంలో నువ్వు విఫలుడ వయ్యావని ఎలా అనగలం?

## అచ్చతెనుఁగు

శిఖరిణి ఇదిట్లే ఉండున్ చెప్పగలననువాడేడి? తెలివిన్
పొదిన్ కల్మిన్ బల్మిన్ గొన మునిచి తీర్పుల్ పలుకగా
ఎదీ విత్తున్ పొత్తున్ కనపడవు మేమే తలపులం
దుఁదాతా! పాట్లంబట్టి పలికెదమేదో చెదరితే?

## 99

सदा स्यात् स्वाध्यायप्रवचनविधौ धीरचलिता
तपस्तद् मन्वाना विहितनिजकर्मावयविका ।
जनेः सद्योगित्वे जनिमरणचर्चाऽफलकृतिः
कुतो वा धातस्त्वं भवसि विफलस्सर्जनगतौ ॥

సదా స్యాత్ స్వాధ్యాయప్రవచనవిధౌ ధీరచలితా
తపస్తద్ మన్వానా విహితనిజకర్మావయవికా।
జనేః సద్యోగిత్వే జనిమరణచర్చాఽఫలకృతిః
కుతో వా ధాతస్త్వం భవసి విఫలస్సర్జనగతౌ॥

### తాత్పర్యం

స్వాధ్యాయ ప్రవచనాలయందు ఎప్పుడూ చెదరని బుద్ధి ఉండాలి. దాన్ని తపస్సుగా భావిస్తూనే తన కర్మల యందు నిశ్చల బుద్ధి ఉండాలి. ఈ పుట్టుక మొత్తం పరమాత్మే అనుకుంటే ఇక పుట్టుక, మరణం గూర్చి మన చర్చలు విఫలప్రయత్నాలే గదా! విధాతా! సృష్టిగతిని ఇలా కొనసాగిస్తూ నువ్వెందుకు విఫలుడ వవుతున్నావు??

### అచ్చతెనుఁగు

శిఖరిణి పెడంబోకల్ లేకుండ చేదువుట అబ్బించుటల నె
ప్పుడున్ బుఙ్గన్ తాల్పన్ [1]తబిసి వలెనై పుట్టువతడే
ఇడెన్ మొత్తంబాతండె అనుకొన లేదే తగవు పు
ట్టుడున్ పోకన్ తాతా! తలపవటె లోటున్ చెదరితే?

1. తబిసి = తపస్వి

# డా. సూరం శ్రీనివాసులు రచనలు

**ప్రచురణలు**

1. సౌమనస్యము (ఖండకావ్యం - పద్యం) - 1979
2. సున్నితపుత్రాసు (వచనకవితాసంకలనం) - 2002
3. సంస్కృతభాణసాహిత్యము (విమర్శ)
   (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహూమతి 1979)
4. సంస్కృతప్రహసనసాహిత్యం (విమర్శ) - 1986
5. Hasya and Prahasana : A Critical Study (Ph.D..thesis) - 1989
6. మత్తవిలాసప్రహసనము - తెలుగు అనువాదం - 1974
7. పూజాకుసుమమ్. (రేడియో నాటకం..సంస్కృతం) - 1987
8. కరావలంబమ్. ( ॥ ॥ ) - 1985
9. ధూర్తానుభవభాణః (సంస్కృతం)
10. గురువరరంజనభాణః ( ॥ )
11. కవిజనమండనభాణః ( ॥ )
12. నటసమాగమభాణః ( ॥ )
13. నికష( విశ్వధర్మవాణి మాసపత్రిక సంపాదకుడుగా వ్రాసిన
    సంపాదకీయాల సంకలనం) - 2009
14. రుక్మిణీశవిజయమ్ (సంస్కృతమహాకావ్యానికి విస్తృతంగా తెలుగు వ్యాఖ్య)
15. శివానందలహరికి జ్యోతిష్మతీ వ్యాఖ్య
    ( సంస్కృతంలోనే - వ్యాకరణవిశేషప్రస్తావనతో) - 2020
16. భవానీ భారతి (అరవిందుని సంస్కృతకావ్యానికి తెలుగు వ్యాఖ్య) - 2019
17. దశావతారస్తోత్రమ్ (వాదిరాజతీర్థరు రచనకు తెలుగువ్యాఖ్య) - 2019
18. కుమారసంభవమ్(కాళిదాసరచితమ్) (అష్టమసర్గ - తెలుగులో వ్యాఖ్య) - 2021
19. రాధాషోడశ నామస్తోత్రం (అర్థతాత్పర్యాలు) - 2020
20. భారతనిరుక్తి – నన్నయరుచిరార్థసూక్తి - 1983
21. భారతనిరుక్తి - తిక్కన సరసోక్తి
22. భారతనిరుక్తి - ఎఱ్ఱన ధర్మోక్తి
23. జనహిత వ్యాఖ్య (ఆంధ్రమహాభారతము - విరాటపర్వము) - 1989
24. జనహితవ్యాఖ్య (ఆంధ్రమహాభారతము - ఉద్యోగపర్వము) - 2000
25. జనహితవ్యాఖ్య..(నిర్వచనోత్తరరామాయణము - తిక్కన) - 2005

26. వ్యాసమహాభారతం - తెలుగువచనం - 2010
(వ్యాసభారతానికియథాతథానువాదం) 20 సంపుటాలు(6000 పుటలు)
27. మహాభారతము — తెలుగు
(మూలం..అనువాదం..విశేషాంశాలు..గీతాప్రెస్..గోరఖ్ పూర్ ప్రచురణ) A4 సైజులో. 7.సంపుటాలు..7250 పుటలు - 2018
28. శ్రీమహాభారతము(సంస్కృతం) విరాటపర్వము
(జనహితవ్యాఖ్య - తెలుగులో - గీతాప్రెస్,గోరఖ్‌పూర్ ప్రచురణ) 2005
(20 - 28 గ్రంథాలకు సహరచయిత డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి)

**ఇతరాలు:**

1973 నుండి ఆకాశవాణి ద్వారా సంస్కృత పాఠాలు, సంస్కృత ప్రసంగాలు కథలు, ఏక పాత్రలు, సూక్తి సుధ, సద్వాణి, తెలుగు సాహిత్య ప్రసంగాలు -

1973 నుండి జాగృతి, భారతి, నాట్యకళ, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, రచన, సమాలోచనమ్, గైర్వాణి, సుధర్మా, ఆత్మజ్యోతి, సంవిత్, సంస్కృత సమ్మేళనమ్ మొదలైన పత్రికలలో వచన కవితలు, విమర్శ వ్యాసాలు, శ్లోకాలు, నాటికలు ముద్రితాలు, బొమ్మలకొలువు - అసంపూర్ణ నవల - విద్యాజ్యోతిలో సీరియల్

1991 నుండి 'విశ్వ ధర్మ వాణి' పత్రికా సంపాదకత్వం



## సూరం చంద్రశేఖరం

**రచన**

1. కృష్ణగానస్రవంతి (ద్విభాషి సోమనాథశాస్త్రిగారి సంస్కృతకృతి)కి ఆంధ్రతాత్పర్యం

